# అభ్యుదయ





హేవిళంబి - ఉగాది

# అభ్యుదయ

## సాహిత్య పత్రిక

## హేవిళంబి - ఉగాది

## 1957 ఏప్రిల్

## ఈ సంచికలో

కొప్పరపు సుబ్బారావు, శ్రీ శ్రీ, ఆరుద్ర, కొడవటిగంటి,

మహీధర్, మధుబాబు, వుప్పల లక్ష్మణరావు,

మాదిరాజు రంగారావు, పిచ్చేశ్వర్రావు, సుంకర,

బెల్లంకొండ, రెంటాల, చిరంజీవి.

ముఖచిత్రం : శ్రీ గోఖలే.

సంపాదకవర్గం :



...సరావు, కొడవటిగంటి కుటుంబరావు,

...ల వెంకట రామయ్య.

# అభ్యుదయ

## వినతి

అభ్యుదయ పాఠక లోకానికివే ఉగాది అభినందనాలు. విశాలాంధ్రావతరణానంతరం, వినూత్నాలంకారాలతో సింగారించుకుని వస్తున్న హేవిళంబి కిదే స్వాగతం.

కొత్త సంవత్సరంలో, మరొక కొత్తపత్రిక మీ కందించు తున్నాం. నిజానికి 'అభ్యుదయ' పత్రికా, అభ్యుదయ రచయితల సంఘమూ సాహితీ లోకానికి అపరిచయమైన దేమీకాదు. సుమారు పదిహేనేండ్లుగా ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం ఆంధ్ర సాహిత్యానికీ, ఆంధ్ర జాతీయ విజ్ఞానవ్యాప్తికీ చేసినసేవ అనల్పమని భావించు తున్నాం. 1946 లోనే ప్రారంభమయిన 'అభ్యుదయ' అనేక అవరోధాలకు లోనై ఆగిపోయింది. అయినా అభ్యుదయ రచయితలు, వ్యష్టిగా, సమిష్టిగా, అభ్యుదయ సాహిత్యంకోసకు చేంసిన పత్రికా – పుస్తక ప్రచురణ కొనసాగించుతూనే ఉన్నారు. ఇందులోని సాధక బాధకాలు స్వల్పంకావని సాహిత్య పత్రికా నిర్వాహకు లందరికీ తెలుసు.

కొంతకాలం, కుంటువడిపోయిన సాహిత్య కార్యకలాపాలను పునరుద్ధరించి, ఇతోధికసాహిత్యసేవకు పూనుకొంది ఇటీవలనే అభ్యుదయ రచయితల సంఘం.

'అభ్యుదయ' ప్రస్తుతం త్రైమాసపత్రికగా వెలువడుతూంది.

ఈ సంచికనుండే మాసపత్రికగా ప్రచురించాలని ప్రయత్నించాం. కాని మాసపత్రికగా నిర్వహించుకోడానికి మేంచేసిన అభ్యర్ధన ఇంకా ప్రభుత్వపరిశీలనలో వుంది. త్వరలో, బహుశా వచ్చే మాసంనుండే, ఇది మాసపత్రికగా రూపొందగలదని విశ్వసించుతున్నాము.

అభ్యుదయ రచయితల సంఘాన్నీ, పత్రికనూ ఆదరించి విరాళాలిచ్చిన దాతలకూ, సర్వవిధాలా సహకరించుతున్న రచయిత లోకానికీ మాకృతజ్ఞత.

ఆంధ్ర సాహిత్య ప్రతిభను నలుదెసలా, నలుదేశాలా చాటడానికి అభ్యుదయ రచయితలూ, పాఠకలోకమూ, సారస్వతాభిమానులూ, సహాయపడగలరని ఆశిస్తున్నాం.

# ప్రేమలేఖ

నార్ల చిరంజీవి

ఏమని వ్రాయుదు స్వామీ
ఏమని మొదలిడుదునయ్యా?
అక్షర ముకుర మందున
అవతరించెదవు నీవే!
ఏమేమో వ్రాయదలచి
ఇంత లింత యూహసేతు
అంతలోనె నన్నలముకు
నింత సిగ్గు దొంతరలవా!
వ్రాయదలచి కూర్చుందును
వ్రాయలేక నే కుందుదు
నా మనసున నిండి, స్వామి
నన్నూపిరి సలుపనీవు
మాట మాట గుదులు గ్రుచ్చి
మాలలల్లుకొందు నేను
మాట మాట సొగసు నింపి
మనసు నల్లుకొందు వీవు!
'శ్రీ' యంటిన నీరూపము!
'నీ' యంటినా నారూపము!
ఏ యక్షర మోము చూచిన
ఇశ్వర మందే యుందుము.
మ్రోగింతువేదో రాగము
యుగయుగాల అనురాగము
తానమ్మునై రాగిణినై
దాగికొందు నీగళమున!
కాలమ్మును చీల్చిచూతు
కనుపించును మన బింబమె.!
ఎడమీయని నీకు, స్వామి!
ఎచటదొస్తు క్రొత్త చివురు?

# నేనెరిగిన రాఘవుడు

## కొప్పరపు సుబ్బారావు

అది 1923 సంవత్సరం. గుంటూరులో ఒక ట్రెయినింగు స్కూలులో పండితుడుగా పనిచేస్తూ 'గుంటూరు అఫీషియల్ డ్రమెటిక్ క్లబ్' వారికి నాటకప్రయోక్తగా సాయపడుతుండేవాణ్ని. 'రోషనార' తొలిప్రదర్శనం ఈ క్లబ్‌వారిదే. పద్మశ్రీ స్థానం తొలిసారిగా ఈ ప్రదర్శనంలో రోషనారా పాత్ర ధరించారు.

1915–25 మధ్య మన తెనుగు నాటకరంగం అపూర్వచైతన్యంతో తొణికిసలాడింది. అప్పటికి మైలవరం బాలభారతీ సమాజం తనపూర్వపు ఔన్నత్యాన్ని కొంత వరకు కోల్పోయినప్పటికీ దానిలో నటిస్తున్న కొందరు నటుల ప్రాముఖ్యత — ముఖ్యంగా శ్రీయుతులు యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, గురజ నాయుడు, పారుపల్లి సత్యనారాయణ మొదలైన వారి పేరు ప్రతిష్ఠలు ఇంకా మరుగుపడలేదు. ఏలూరు బందరు గుంటూరు రాజమహేంద్రవరం మొదలైన యితర కేంద్రాలలో శ్రీయుతులు ముంజులూరి కృష్ణరావు కొచ్చెర్లకోట రంగారావు హరిప్రసాదరావు బలిజేపల్లి లక్ష్మీకాంతం ముప్పిడి జగ్గరాజు రాయప్రోలు సత్యనారాయణ ఆలమూరి పట్టాభిరామయ్య మొదలైన నటుల కీర్తి సౌరభాలు తెనుగుదేశం నలుమూలల పరిమళిస్తున్న రోజులు అవి.

అయితే వీరందరిని మరిపించే ఒక నవ్యశక్తి మన నాటకరంగంలో అవతరిస్తున్న సూచనలు విరివిగా కనిపించడం సాగాయి. అది రాఘవుడి రంగావతరణ.

1921 వరకు రాఘవుడు ఉత్తరసర్కార్లకు దాదాపు అపరిచితుడు. ఎక్కువగా బెంగుళూరు మద్రాసు హైదరాబాదుల్లో ప్రదర్శనలిస్తుండేవారు. కోస్తా ఆంధ్రమండలాలకు ఆయన రాకపోవడానికి కొన్ని కారణాలు లేకపోలేదు. కోస్తా ప్రేక్షకులు కేవల సంగీతప్రియులనే ఒక దురభిప్రాయం, తన అభినయపద్ధతి వారికి రుచిస్తుందో లేదో అనే సందేహం, అదిగాక వారు 'అల్లరిజనం' అంటూ ఆయన సన్నిహితులు కొందరుచేసిన అసంబద్ధ ప్రచారం ఇవన్నీ కలిసి ఆయన్ని చిరకాలం కోస్తా మండలాలకు దూరం చేశాయి. అయితే రోజులు గడిచిన కొద్దీ మన జనానికి (ముఖ్యంగా కృష్ణా గుంటూరు మండలాల వారికి) ఆయన్ని చూడాలనే తహతహ ఎక్కువైంది. 1920 లో తొలిసారిగా యీ మండలాలకు వచ్చారు. బందరు రాజమహేంద్రవరం బెజవాడ మొదలైన కేంద్రాలలో ప్రదర్శనలిచ్చారు. ఆ ప్రదర్శనలు మన నాటకరంగంలో ఒక విప్లవం రేకెత్తించాయి.

నేనుగాని మా క్లబ్బువారుగాని ఆయన ప్రదర్శనాలు చూడలేము. వార్తలు మాత్రం వింటుండేవాళ్ళం. పఠాన్ పాత్రధారణ చాలా అమోఘంగా వుంటుందట. నాన్ రొట్టె తింటూ రంగప్రవేశం చేస్తాట! ఆవేశంతో చాక్కు చెండేసుకుంటాడట! ఒక కంటితో అశ్రువులు రాలుస్తూ మరో కంటితో రౌద్రం ప్రదర్శిస్తాడట! పద్యాలు అదేదో కొత్తఫక్కీలో పాడతాట్ట!

ఆ రోజుల్లో నలుగురు నటులు ఎక్కడ చేరితే అక్కడ యీ రాఘవగోష్ఠి, పూర్వపక్ష సిద్ధాంతాలు సహా నడుస్తుండేది.

మా క్లబ్బు సభ్యులకు ఆయన్ని చూడాలనే తహతహే కాకుండా ఆయనతో కలిసి ఒక నాటకం ఆడాలనే వింత అభిలాష కూడా కలిగింది. అభిలాషను విన్నవించుకున్నాం. ఆయన అంగీకరించారు.

నాటకం శ్రీ కోలాచలం శ్రీనివాసరావు రచించిన 'విజయనగర సామ్రాజ్య పతనం' (ఫాల్ ఆఫ్ విజయనగర్). ఆ నాటకానికి కథానాయకుడు 'పఠాన్' కథానాయిక 'ఆసాబీ'. ఈ రెండుపాత్రలు మినహా మిగతా నాటకం యావత్తూ మా క్లబ్బువారు తయారు చేసుకునేట్టు నాటకం నెల్లూరులో ప్రదర్శించేట్టు ఏర్పాటు జరిగింది. ప్రదర్శన తేదీకి ఒకరోజు ముందుగా ఆయనా ఆసాబీపాత్రధారి సరాసరి నెల్లూరు చేరేట్టు నిర్ణయం అయింది.

మేము రెండు రోజులు ముందుగానే నెల్లూరు చేరాం. ఆయనా ఆసాబీ పాత్రధారీ రైలుతప్పిన కారణంగా టాక్సీ చేసుకుని బళ్ళారినుంచి సరాసరి నెల్లూరు చేరేటప్పటికి రాత్రి 7 గంటలైంది. పది గంటలకు ప్రదర్శనం.

రాఘవుడు ఆరాత్రి 'పఠాన్' పాత్ర ధరించి ప్రదర్శించిన అభినయప్రతిభ నా జీవితానికి మరుపురాని ఒక అపూర్వ కళానుభవమైంది. వివరించే ముందు ఆ నాటక ఇతివృత్తాన్ని అతిసంగ్రహంగా ఇక్కడ పొందుపరుస్తాను (పఠానుపాత్ర పరిచయం కోసం).

అళియ రామరాజు విజయనగరసమ్రాట్టు. శ్రీకృష్ణదేవరాయల వంశావళిలో కడపటివాడు. తళ్ళికోట యుద్ధం జరగడం, విజయనగర సామ్రాజ్యం మహమ్మదీయులకు హస్తగతం కావడం ఇతని పాలనలో జరిగాయి. పఠాను రామరాజు కొడుకు. ఒక మహమ్మదీయ స్త్రీవల్ల కలిగిన రహస్య సంతానం. ఆసాబీ ఒక తురుష్క సర్దారు పుత్రిక. స్వచ్ఛమైన మహమ్మదీయ. ఆసాబీ పఠాన్ను ఒకరినొకరు ప్రేమించుకుంటారు. పఠాను జన్మరహస్యం ఆసాబీకి తెలియదు. పఠాను గొప్పయోధుడు. రామరాజు సైన్యంలోనే ముఖ్య దండనాథుడుగా పనిచేస్తున్నాడు. గాఢమైన స్వామిభక్తి వుంది. అయితే ఆసాబీయెడల ప్రేమ అంతకంటే గాఢమైంది. కాబట్టి ఆమె ప్రేరేపణ ఫలితంగా విద్రోహపంథా అవలంబించి తళ్ళికోట యుద్ధంలో రామరాజుతలను తానే నరికి తెచ్చి శత్రువులకు కానుకగా అర్పిస్తాడు. ఈ విద్రోహానికి ఫలితంగా ఆసాబీ అతణ్ణి పెండ్లి చేసుకోడానికి అంగీకరిస్తుంది. కాని చివరఘడియల్లో అతడి జన్మరహస్యం ఆమె తెలుసుకుంటుంది. 'నీవు హిందువుకు పుట్టావు. నీ రక్తం కలుషితం' అని నిర్మొగమోటంగా చెప్పి నిరాకరిస్తుంది. పఠాను ఉన్మాద అవస్థలో పడతాడు. చివరకు పిస్తోలుతో ఆమెను పేల్చేస్తాడు.

ఆ ప్రదర్శనానికి హార్మోనియం నేనే వాయిస్తున్నాను. ఎవరెవరికి ఎక్కడ పాటలు పద్యాలు ఉన్నాయో ఒక లిస్టుగా వ్రాసుకుని హార్మోనియం ముందు కూర్చున్నాను.

'పరబ్రహ్మ' అయింది. తెరలేచింది. రాఘవుణ్ణి రంగస్థలంమీద చూడటం నాకు అదే మొదటిసారి. ఆజానుబాహువు విగ్రహం కుదిరికగల అవయవ సౌష్టవం విశాలమైన నెన్నుదురు దట్టమైన కనుబొమ్మలు భావగంభీరమైన విశాల నేత్రాలు. అలాంటి

నాట్యకళాప్రపూర్ణ



టి. రాఘవ [బళ్లారి]

నట విగ్రహాన్ని అంతకు పూర్వం నేను రంగస్థలంలో ఎన్నడూ చూడలేదు.

ప్రదర్శనం నడుస్తూవుంది. ఒక్కొక్క ఘట్టం నడిచినకొద్దీ రాఘవుడి అమోఘ నటనా వైదుష్యం సమ్మోహనాస్త్రంవలె ప్రేక్షకులను భ్రమింపజేస్తున్నది. చివరఘట్టం అసాబీ హత్యాఘట్టం - వచ్చింది. మరుపురాని ఘట్టం. అసాబీ నిరాకరణ పఠాను క్రోధం పరాకాష్ఠ అందుకున్నాయి. పఠాను ఉన్మాదం పగ్గాలు తెంచుకుంది. పిస్తోలు తీశాడు. గురిపెట్టాడు. పేల్చాడు. గుండు మోగిన శబ్దంరాలేదు. (సైడ్ వింగులో వున్న ప్రాంటర్ పేల్చిన నేలటపాకాయ నెమ్ముతిన్న కారణంగా) మళ్ళీ రెండోసారి పేల్చాడు. ఈసారి శబ్దం వచ్చింది. అసాబీ నేల వ్రాలింది. ఇక అది మొదలు సుమారు ఆరు నిమిషాలపాటు నడిచిన ఘట్టంలాటిది తెనుగు నాటకరంగంలో మళ్ళీ ఇంతవరకు నేను చూడలేదు.

ఆమె నేలమీదపడిన తర్వాత కొన్ని క్షణాలకు పఠానుకు ఉన్మాదశాంతి కలుగుతుంది. ఆవేగం సమతకు వస్తుంది. కళేబరాన్ని శూన్యదృక్కులతో చూస్తాడు. ఆదృక్కుల్లో క్రమంగా వెనకటి ప్రేమస్మృతులు తొణికిసలాడతాయి. ఎక్కడ్నుంచి వచ్చిందో కన్నీటి ధార బిందుబిందువుగా వర్షిస్తుంది. హృదయం బద్దలైంది. కెవ్వుమని కేకవేస్తాడు. కళేబరంపక్కన కూలబడి ఆమె చేతులు వ్రేళ్ళు ముఖం కనులు ముంగురులు పరిశీలిస్తాడు. అతడి వ్రేళ్ళు - వణికిపోతున్న వ్రేళ్ళు - అతడి హృదయంలో ప్రజ్వలించిన పశ్చాత్తాపజ్వాలలను మూగభాషలో వెల్లడిస్తున్నాయి. ఇంతలో చప్పుడవుతుంది. "ఎక్కడ? పఠానెక్కడ" అనే కేకలు వినిపిస్తాయి. ఆ కేకలు మరింత భీకరంగా మరింతదగ్గరగా వస్తున్నకొద్దీ అతని ముఖం భీభత్సంగా మారిపోతుంది. ఆ భీభత్సంకూడా కుప్పగా ఒక్కసారి రాదు. కెరటంగా వస్తుంది. ఒక్కొక్క భావతరంగం ఆ ముఖంలో అచ్చుగుద్దినట్లు వెల్లడవుతుంది. ఆ కేకలు ఎవరివి? రక్షకభటులవా? ఎందుకు వస్తున్నారు? తనను పట్టుకుపోవడానికా? ఏమో! తాను చేసింది నేరమా? నేరమే! హత్య! అవును అవును! నేరం! హత్య! స్త్రీహత్య! శిక్ష!... గజగజ వణికిపోతాడు. ముఖం ఉన్నట్లుండి ఒక్కసారి వైవర్ణ్యం పొందుతుంది. హత్యచేసిన నేరస్థుడి హృదయ సంక్షోభం భయం బెదురుచూపులు దైన్యం నిర్వేదం గ్లాని అమోఘంగా ప్రతిబింబిస్తాయి. ఒక్క అంగవేసి సైడ్ వింగుకు ముఖం వాటు చేసుకుంటాడు. మరో అంగ వేసి కుర్చీచాటున కూలబడతాడు, మళ్ళీ లేస్తాడు. అటు ఇటు బిక్క చూపులు చూస్తాడు. ఇవన్నీ ఎంత సహజంగా ఎంత ఎంత లలితంగా ఉన్నవంటే అన్ని వందలమంది ప్రేక్షకులతో కిక్కిరిసివున్న హాల్లో సూదివేస్తే వినపడేంత నిశ్శబ్దంగా వుంది.

ఈ విచిత్ర మూకీసన్నివేశం సుమారు ఆరు నిమిషాలపాటునడిచింది. పాటలేదు. పద్యంలేదు. ఒక్క సంభాషణకూడాలేదు. ఆ ఆరు నిమిషాలపాటు రాఘవుడు తన హృదయమే ఇతివృత్తంగా తన ముఖభావమే రచనగా తన ఆంగిక సాత్వికాభినయములే దానికి వ్యాఖ్యలుగా ఒక అపూర్వ నాట్యకళాఖండాన్ని సృజనాత్మకంగా ఆవిష్కరించాడు. రాఘవుడు ఏకాకి - ప్రేక్షకులు వందలు. ఆ యేకాకి చేతిలో ఆరు నిమిషాలపాటు అన్నివందలమంది సామాజికులు అన్నివందల వెన్నముద్దలై పోయారు. వారి ఆత్మలను అతడి ఆత్మ ఆ

కాసేపు తనలో హరించుకుంది. వెలుపలి ప్రపంచం ఆ కాసేపూ అంతర్ధాన మైంది. ఆవరణలన్నీ కూలిపోయాయి. సామాజిక లోకం రసార్ణవంలో మునక వేసింది. నాట్య కళ తనలో గర్భిత మైన ప్రచండశక్తిని ఒక్కసారి మిలమిలమని మెరిపించింది.

పరిమిత మైన తన శారీరక ఆవరణను దాటి ఏ ఆత్మ ఆనందసిద్ధి పొందగలుగుతుందో అదే అలౌకిక రసానందం అంటాడు నాట్యశాస్త్ర వ్యాఖ్యాత అభినవగుప్తుడు (భగ్నావరణ చిద్విశిష్టో రత్యాది స్థాయీ భావో రసః). రాఘవుడి నటనకు పర్యవసానంగా ఆరాత్రి ఆ సన్నివేశంలో ప్రేక్షకులు పొందిన అనుభవం ఈ సూక్తికి ఉజ్వల నిదర్శనంగా కనిపిస్తుంది.

రష్యా నాట్యాచార్యుడు స్టానిస్లావిస్కీ రచించిన 'ఆర్ట్ ఆఫ్ ది స్టేజ్' అనే గ్రంథంలో ఒక వాక్యం కనిపిస్తుంది. "సంభాషణ లేకుండా కేవల ముఖభావాలతో ప్రేక్షకులను ఎక్కువసేపు వశంలో ఉంచుకోజాలం. దానికి పరిమితి అయిదు లేక ఆరు నిమిషాలు. అదైనా మహానటుడికి మాత్రమే సాధ్యం". రాఘవుడి మహానటన కూడా ఆ పరిమితిలోనే ముగిసింది.

రాఘవుడి జీవితకాలంలో మన ఎమెటూర్ నాటకరంగం ఈనాడున్నంత ఉజ్వలంగా లేదు. ఇప్పుడున్నంతమంది నవనటీనటులు నవరచయితలు ఆనాడు లేరు. కాబట్టి ఆయన కృషికి సరైన ఫలితం కలగలేదు. ఆయన్ని చూచి నేర్చుకోగల తరం వారు వచ్చేసరికి ఆయన లేకుండా వెళ్ళిపోయాడు. అది తీరని దురదృష్టం.

రాఘవుని వంటి కళాకారుడు ప్రతిచోటా ప్రతిసారీ మనకు లభించడం అసంభవం. అనంత ఆకాశంలో ఎప్పుడో ఒక్కసారి కనిపిస్తుంది ఇంద్రధనుస్సు! త్రవ్వగా త్రవ్వగా ఎక్కడో ఒక్కచోట లభిస్తుంది కోహినూర్! ఇవి అపరూప వస్తువులు.

రాఘవ నిర్యాణం 1944 ఏప్రియల్ 17 వ తేదీ. తదాదిగా తెనుగునాట నలుమూలల ఆయన వర్ధంతులు జరుపుకుంటున్నాం. రాఘవుడు కళాకారుడే కాదు కళాయోగి. "నాఅభినయమే నాయోగం" అనే రాఘవసూక్తిని విననివారు ఉండరనుకుంటాను. అయితే ఆయన ఉన్నతఅంతస్తును ఒక్కసారిగా మనం అందుకోలేకపోవచ్చు. కాని అందుకు దృఢసంకల్పంతో యత్నం చెయ్యడం మన కర్తవ్యం. ఆ కర్తవ్యం నిర్వహించి ఆయన కళా సంపదకు వారసత్వ అర్హతను సంపాదించుకుందాం.

—o—

"నాగలిపట్టి నడుమునంచి పనిచేసేవాడికంటె, తిండి సమాజం ఎక్కువసుఖాలూ, తీరికా కల్పించింది కదాఅని, కవిగానీ, చిత్రకారుడుగానీ సంతృప్తిపడరు సరికదా, సంపాద్యంలోనూ రైతుకంటె తమదే పైచేయి కావలెనంటారు. స్టూడియోలో తాను పనిజేసింది పొలములో రైతుపడే పాటుకంటె చాలగంట లెక్కువైనట్లు, చాల కష్టమైనట్లు! పనిచేయకుండా కులుకుదామనే నవీన పిశాచికి కళాకారులు పూజారులవుతున్నారు."

—బెర్నార్డ్‌షా.

# చిత్ర కవిత్వం

## శ్రీరంగం శ్రీనివాసరావు

ఏదైనా ఒక చిత్రమనేదే లేనిదే అది కవిత్వం కానేకాదు. అందుచేత ఆలెక్కని కవిత్వం సమస్తం చిత్ర కవిత్వమే. సరేనిగా పనీ పాటా లేని కవులు మాటలలో చేసే గారడీ మాత్రమే చిత్రకవిత్వమని చెప్పి ఊరుకోకూడదు. ఇంద్రజాలం నిజమే. ఇందులో చాలా ఉంది. కవిత్వానికి ప్రధానంగా ఉండవలసిన ఆవేశం ఏ కోశానా కనబడదు. అటునుంచి ఇటు చదివినా, ఇటు నుంచి అటుచదివినా ఒకలాగే సాగే పద్యాన్ని ఊరికే ఆశువుగా రచించడం అసాధ్యం. ఉత్తమ కావ్యాన్ని చదివితే ఉత్పన్నమయ్యే రసానందం వంటిది. 'కిని సిరి, నలిసిరి, పిలిచిరి' వలె అన్న అన్నీ గుడులూ, 'కుసుములు, పురుగులు, తురుపులు' వలె అన్నీ కొమ్ములూ ఉన్న పద్యాలవల్ల గాని, పద్యం కడుపులోఉన్న పద్యంవంటి గర్భకవిత్వం వల్ల గాని నిష్పన్నం కాజాలదు. ఫలానా రాజుగారి తాలూకు కీర్తి యొక్క తెల్లదనాన్నీ, ప్రతాపం తాలూకు ఎర్రదనాన్నీ, శృంగారంయొక్క వెచ్చదనాన్నీ, ఐశ్వర్యపు హెచ్చుదనాన్నీ, ఒకే ఒక్క పద్యపాదంలో ఇముడ్చి రచిస్తే అందులో ఉన్న అర్థభేదాలన్నింటినీ వెదుక్కుంటూ కూర్చోగలిగిన తీరుబా టెవరికీ ఈనాడు లేదు. ఆనాటి రాజరికం నశించిపోయి, నియంతలూ, రాష్ట్రపతులూ ప్రధాన మంత్రులూ, రాజ్యపాలన చేస్తున్న రోజులివి. వీరి చర్యలను పత్రికలూ రేడియోలూ, సినిమాలూ ప్రచారంచేస్తాయి. అదైనా నిర్వచన నిరోష్ఠ్య శ్లేష యమక చిత్రగతులలో కాదు. అందరికీ చప్పున అర్థమయే భాషలో. అందుచేత అప్పకవి చెప్పిన చిత్ర కవిత్వ పద్ధతులకిప్పుడు చాలా డిస్కౌంటు. బాగా డిసెడ్వాంటేజీ. ఒకానొక సాంఘిక పరిస్థితిలో సాధ్యమైన సాహిత్య వ్యాసంగం ఆ పరిస్థితి అంతరించిన తర్వాత కూడా అమలు చెయ్యగలుగుతామనుకోవడం అవివేకం.

ఏదో ఒకరూపంలో చిత్రకవిత్వంఅనేది ఎప్పుడూ ఉంటుందనే సత్యాన్ని ఇక్కడ గుర్తించాలి. 'విచిత్రం వినా కవిత్వం నాస్తి' అని ఇంతకు ముందే చెప్పాను. ఇది వెనకటి రోజుల్లో ఉంది. ఇప్పుడూ ఉంది. ఇక ముందు కూడా ఉంటుంది. అయితే వెనకటి రోజుల ధోరణులు ఆనాటి పరిస్థితుల కనుగుణ్యంగా రూపొందితే నేటి పరిస్థితుల ఫలితంగా ఈనాటి ప్రక్రియలు సాగుతున్నాయి. వెనకటి చిత్ర కవిత్వాలను గురించి నేనిక్కడ విపులంగా వివరించ దలచడం లేదు. ఏ మంచి గ్రంథాలయానికి వెళ్ళినా ఇవి లభ్యమవుతాయి. అప్పకవి తన లక్షణ గ్రంథంలో వీటి జాబితా ఇచ్చాడు. అది మాత్రం ఇక్కడ ఉటంకిస్తాను.

'అనులోమము, విలోమము, నిరోష్ఠ్యము
ను,తలకట్టును,గుడులుశృంగములు,నక్షు
రవిలోపమును, పదభ్రమకంబు, పద్య
భ్రమకమును, నల్లెంట్లు, మరియు నేక
పదియు, ద్విపదియు, త్రిపదియును నేక
వర్ణంబును, ద్వ్యక్షరి, త్ర్యక్షరియును
సరవి నిర్వచనాఖ్య సంఘటనంబును నా
దిగా గొన్ని పద్యంబులెల్ల
క్షితిని చిత్రకవిత్వ ప్రసిద్ధ నామ
ధేయముల చేత పెంపొంది - తెలివివిగాను...

ఈ జాబితాకు ఇంకా, సమస్యాపూరణం, న్యస్తాక్షరి, నిషిద్ధాక్షరి మొదలైన కవితా వినోదాలను కలుపుకోవచ్చు. వీటన్నిటికీ ఉదాహరణలిస్తూ కాలయాపన చెయ్యడం నా ఉద్దేశం కాదు. మన ప్రాచీన కవులు మాటలతో చేసిన మజాలు ఇన్నీ అన్నీ కావు. ఇవన్నీ స్మరిస్తూ ఎంతకాలమైనా సరదాగా వెళ్ళబుచ్చవచ్చును. వే॥రి ప్రభాకర శాస్త్రి వంటివారు ఎంతో శ్రమపడి ఇటువంటి ఎన్నింటినో సేకరించారు. అందులో కొన్ని గ్రంథ రూపేణా వెలువడ్డాయి కూడా! ఇంకా వెలుగుచూడని ఎంతో సామగ్రి చెల్లాచెదురుగా ఆంధ్రదేశం అంతటా దొరుకుతుంది. దానిని జాగ్రత్తచేసి ప్రచురించవలసిన బాధ్యత సాహిత్య పరిషత్తులదీ, విశ్వవిద్యాలయాలదీ! ఇక్కడ నా సంకల్పం చిత్రకవిత్వాన్ని సామాజిక దృష్ట్యా మనోవైజ్ఞానికరీత్యా పరిశీలించడం మాత్రమే.

‘భావ భవ భోగ సత్కళా భావములలో’ ‘రాజనందన రాజ రాజాత్మజులు సాటి’ అనే పద్యం ఎటువంటి పరిస్థితులలో ఆవిర్భవించిందో చూద్దాం.

నాగరికత ప్రధానంగా వ్యావసాయికం. నదీ తీరాల నంటిపెట్టుకొని నగరాలు. దాటశక్యంగాని కొండలమధ్య కోటలు. ఏడాదికి సరిపోయే గ్రాసం ఇంట్లో ఉంటుంది. ఆయా వృత్తుల కనుగుణ్యంగా చాతుర్వర్ణ్యవిభాగం. రాజుకొడుకు రాజుగా వడ్రంగి కొడుకు వడ్రంగిగా వంశ క్రమానుగతమైన సాంఘిక వ్యవస్థ. ఏనుగులూ గుర్రాలూ కత్తులూ కటార్లూ, ఈ వ్యవస్థని రక్షించే కవచాలు. ఏ గ్రామానికా గ్రామం స్వయం సమృద్ధం. ఎద్దు బళ్ళలో ప్రయాణం. ఇంకా ఘనకార్యాలకీ ఇంతకన్న వేగానికీ గుర్రపుబళ్ళు. వేగాన్ని కొలవడానికి అశ్వశక్తి ప్రమాణం. తాటాకులమీద గంటాలతో లిఖించిన గ్రంథాలు. కంఠపాఠం చెయ్యడానికి వీలుగా పద్యానికి ప్రాముఖ్యం.

మనోహర స్వప్నాలు కనడం మానలేని మానవుడు తాను కన్న ప్రతీ కలకీ ఏదో ఒక ఆకారం ఇస్తాడు. మానవుని కల ధరించే ఆకారమే కళ. అతని అంతిమ స్వప్నమే భగవంతుడు. కాని ప్రతీస్వప్నానికీ కాళ్ళు నేలమీదనే ఉంటాయి. భగవంతుడనే స్వప్నానికి మానవుడే ప్రాతిపదిక. దేవుడు మనుష్యుణ్ణి నిర్మించాడనడానికి బదులు మనుష్యుడే దేవుణ్ణి సృష్టించుకున్నాడనడం సమంజసం. ఈ దేవుని గురించి ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క మానవుడు ఒక్కొక్క విధంగా సాక్ష్యం ఇచ్చాడు. నిద్రావస్థలో వాస్తవికతపొందే వైరూప్యమే స్వప్నం. స్వప్న ప్రపంచంలో వాస్తవిక లోకం చిత్రవిచిత్రంగా పరావర్తమవుతుంది. అక్కడ దేవుడు జగత్ప్రభువూ, జగజనకుడూ. మానవుని ఆశలు స్వర్గాన్ని కల్పిస్తాయి. భయాలు నరకాన్ని. మానవుడు చేసే మంచిపనులకు స్వర్గంలో బహుమతి. చేసే పాపాలకు నరకంలో శిక్ష. ఈ పుణ్య పాపాలను నిర్ణయించే ప్రాడ్వివాకుడు భగవంతుడు. భగవద్రాజ్యంలో కూడా మానవలోకంలోవలెనే సైన్యాలూ న్యాయస్థానాలూ, ఉద్యానవనాలూ ఉంటాయి. దేవతలలోకూడా కొడుకులూ, పినతండ్రిలూ, మేనమామలూ, తోడుకోడళ్ళూ, ఉంటారు. వీరి చర్యలను వివరించేవీ, సంబంధ బాంధవ్యాలు వర్ణించేవీ మనకి ఒకటి కాదు అష్టాదశ పురాణాలున్నవి.

భూలోకంలో రాజంటే సాక్షాత్తూ విష్ణ్వంశ సంభూతుడు. అతని పూర్వీకులు

సూర్య వంశానికో, చంద్ర వంశానికో చెందినవారు. కావలిస్తే వంశవృక్షాలున్నాయి చూచుకోవచ్చును. కాదన్న వాడికి నరకం తప్పదు. అయినా ప్రజలందరిలోనూ ఈ అభిప్రాయాలు ప్రబలి ఉన్నప్పుడు వారిలో ఎవడైనా ఒకడు తప్పిజారి కాదంటే వాడి బ్రతుకు ప్రత్యక్ష నరకమే అయిపోతుంది.

ఇటువంటి అభిప్రాయాల మధ్య, సాంఘిక పరిస్థితుల మధ్య జీవించే కవి రాజును ఇంద్రుడనీ, చంద్రుడనీ, ఎందుకు పొగడడు? ఎంత కవి అయినా ఆతనికీ కడుపు గడవాలి కదా? రాజాస్థానాలలో ఉద్దండపండితు లుంటారే? కష్టపడి ఒక కంద పద్యం రాస్తే చూసే దెవడు? అందుచేత ఏదో ఒక చమత్కారం చూపించాలి. ఇంకొకడు ఆ పద్యం నేను రాసిందే అనకుండా తన సొంత వ్యాఖ్యానాలు గుప్పించగలగాలి. నిలుచున్నపాటన అమరాది నిఘంటువుల నిఘంటువుల నుండి, తదితర శాస్త్ర గ్రంథాల నుండి శ్లోకాలు చదువుతూ తన పాండిత్య పటిమను ప్రదర్శించాలి. అప్పటి కప్పుడు, ఆశువుగా పద్యాలు చెప్పాలి. అష్టావధానాలూ, శతావధానాలూ చెయ్యాలి. ఈవిధంగాకోటలో పాగా వేయడానికి పనికొస్తాయి చిత్ర గర్భ, శ్లేష, బంధ కవిత్వాలు. తీరా పాగా వేసి స్థిరాయించినవాడు మాత్రం ఇవన్నీ కుక్షింభరులుచేసే క్షుద్రరచనలని తేలికగా తోసి పారేస్తాడు.

చిత్రకవిత్వం చిన్నపిల్లలు మాటలతో ఆడుకునే ఆటలలో ప్రారంభమవుతుంది. 'కనా కపే కరు కరా కమా కరా కవు' అని క భాషలో నా పేరు రామారావు అని చెప్పే కుర్రాడు చెబుతున్నది చిత్రకవిత్వమే. స్కూలు కుర్రాడు గోడమీద 'దడిగాడువానసిరా' అని రాసినప్పుడు అనులోమము, విలోమము అన్నీ అప్పకవికి లక్ష్యప్రాయుడు అవుతున్నాడు. ఇంతెందుకు? ఏడాది ఈడైనా లేని శిశువు తా తా తా, మా మా మా, అని ఒకే అక్షరాన్ని బహు పర్యాయాలు ఉచ్చరిస్తే ఏకాక్షరికి అంతకన్న మంచి ఉదాహరణం మరేది ఉంటుంది?

అయితే ఇలా అన్నానని చిత్రకవిత్వ రచన చిన్నతనపు చేష్టగా కొట్టి పారెయ్యకూడదు. శిశువుల మనస్తత్వాన్ని పరిశీలించినట్లయితే కవిత్వపు ప్రారంభాలు కనిపిస్తాయి స్పష్టంగా. ఒక్క శిశువుల చిత్తవృత్తిలోనే కాక ఆదిమ జాతులనీ, అనాగరిక జాతులనీ మనం ఈసడించే తెగలవారి వ్యాసంగాలలో కూడా కళా దేవత స్వరూపం కళ్ళకు కడుతుంది. ఈనాడు పేరుమోసిన మహాకవులు· చిత్రకారులూ, శిల్పులూ, వాగ్గేయకారకులూ, అన్ని రకాల కళాకారులూ ఈ ప్రక్రియలను జాగ్రత్తగా ఆకళింపు చేసుకుంటున్నారు.

పారిశ్రామికంగా, యాంత్రికంగా, సాంకేతికంగా అత్యద్భుత అభివృద్ధిని సాధించిన నేటియుగంలో కళలకున్నూ ఒక ప్రత్యేకమైన విశిష్టత్వం గోచరిస్తుంది. నేటి కళా స్వరూపాలను నిర్ణయించేది నేటి జీవిత విధానమే. అచ్చు యంత్రం విద్యను అందరికీ అందుబాటులోకి తెచ్చింది. స్టీమర్లూ, విమానాలూ, దేశదేశాల మధ్య ఉన్న దూరాన్ని తగ్గించివేశాయి, సినిమాలూ, రేడియోలూ, ప్రపంచం మూల మూలలకూ అలుకుపోయాయి. వీటిని నిర్వహించడం ఎంతో శాస్త్రీయ విజ్ఞానంతో కూడుకున్న పని. సమరుల చేతిలో ఇవి సాధించలేని విజయమే లేదని చెప్పవచ్చును. మొ

త్తం మీద, పలురకాల విభేదా లెన్ని కనబడుతున్నా, అందరు మానవులూ ఒకటే అనే అభిప్రాయం ఈనాడు విస్పష్టంగా రూపొందుతోంది.

కవుల భాషా ప్రయోగంమీద నేటి జీవిత విధానం తెస్తూన్న మార్పుల కుదాహరణ లనేకం ఇవ్వవచ్చును. వాటిలో మూడింటినిమాత్రం దిఙ్మాత్రంగాఇక్కడ చెబుతున్నాను. ఇవి టెలిగ్రామ్, వాణిజ్య ప్రకటన, వార్తాశీర్షిక. ఈ మూడూ ఈ నాటి జీవితానికి లక్షణాలే. టెలిగ్రామ్‌కి విషయమే కాని వ్యాకరణం ప్రధానం కాదు. ఎంత తక్కువగా మాటలుపయోగిస్తే అంతడబ్బు పొదుపుకూడాను. చిన్న పిల్లను తన మనస్సులో ఉద్దేశాన్ని తక్కువమాటలలో, కర్త కర్మ క్రియల నిర్బంధాలతో నిమిత్తంలేకుండా ఏమాత్రం ప్రకారం వెల్లడించ గలుగుతున్నాడో, అదే టెలిగ్రామ్‌కు కూడా వర్తిస్తుంది. అమెరికన్ కవి ఈ ఈ కమ్మింగ్స్ వ్రాసే గీతాలలో ఈ పొదుపరితనం కనిపిస్తుంది. అంతేకాక అచ్చుయంత్రం కలిగించే అవకాశాలనుకూడా అతడు అత్యద్భుతంగా వాడుకుంటాడు.

రెండవదైన వాణిజ్యప్రకటనలోకూడా ఈ సూత్రాన్నే చూడవచ్చును. ప్రకటించుతూన్న సరుకు యొక్క గుణగణాలను తక్కువ మాటలలో ఎక్కువ హృదయంగమంగాచెప్పాలి. ఆలాగే వార్తా శీర్షికలు కూడా. వార్తాసారాంశం అంతా రెండు మాటలలోఇమిడిపోవాలి.

నేటి చిత్రకారులు ఒకటి రెండు రేఖలతోను, నేటి కవులు ఒకటి రెండు మాటలలోను తాము చెప్పకలిగినది చెబుతున్నారంటే బండెడు గ్రంథం రాయలేక కాదు. ఈ విధంగా చెప్పటానికి సామాజికంగాను, మనోవైజ్ఞానికంగాను తగినన్ని కారణాలున్నాయి. కవిత్వంలో వస్తూన్న నూతన ధోరణులన్నీ కనిపించడానికేమో చిత్రంగానే ఉంటాయి గాని వాటిని పరిసరాలలో ఉన్న పరిస్థితులతో అన్వయించి చూస్తే ఎన్నో క్లిష్టసమస్యలు సునాయాసంగా అవగాహన కాగలవు.

—o—

“గనుల ముడిసరుకునుంచి మంచి లోహాన్ని తీసినట్లుగా ప్రజాజీవితంనుంచి ఉత్తమసారస్వతాన్ని కళలనూ తయారుచేయవచ్చు. మొదట అవి మొరటుగానూ ముతకగానూ వున్నాగాని, కొల్లలు కొల్లలుగా ప్రజాజీవితంలో మనకవి లభిస్తాయి. ప్రజాజీవిత మనేది అంతుపొంతులేని వంటిది. ఎంతత్రవ్వి తీసినా తరుగుపడని గని!

— మావోసీటుంగ్.

# క్లార్కు సూర్యారావు

## ఆరుద్ర

క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
పార్కులోకెళ్ళాడు పనిలోంచివచ్చి

మేజాల భూజముల మేదినిలోంచి
చిత్రాల చీటాల చిట్టడవిలోంచి
రొప్పుకొని రోజుకొని రోజెల్ల గడిపి
గాలికై జాలికై గాలించగాను
పార్కులో కొచ్చాడు వర్కులోనుంచి
క్లార్కు సూర్యారావు కాళ్ళీడ్చుకొచ్చి

పార్కులో ఉంటారు పడుచు దంపతులు
పార్కులో ఉంటారు పాతస్నేహితులు
పార్కులో ఉంటారు పసిపిల్లవాళ్ళు
పార్కులో ఉండనిది ప్రశాంత మొకటే

క్లార్కు సూర్యారావు పార్కులోనుంచి
మార్కెట్టుకెళ్ళాడు మనశ్శాంతికొరకు.
మార్కెట్టులో మంచి సరుకులుంటాయి
డబ్బున్నవాళ్ళకే దొరుకుతుంటాయి
మధ్యతరగతివాళ్ళ కొరుకుతుంటాయి
మనవాడి మనసుని తినివేస్తాయి
క్లార్కు సూర్యారావు మార్కెట్టునుంచి
కూర్కు తీద్దామని గృహమునకుపోయె

ఇల్లు ఇర్కటము ఆలి మర్కటము
ఆఫీసులో దొర, అసలు కర్కాటకం
పార్కులో విశ్రాంతి కనలేదు తాను
మార్కెట్టులో సుఖము కొనలేదు తాను

క్లార్కు సూర్యారావు అర్కుడేగాని
కలకాలముండే గ్రహణాన చిక్కి
తలపులున్నవిగాని వలపులులేవు
అనుకోడమేగాని అనుభవంలేదు

కనుమూసి కనుతెరచి కలగాంచుటే సదా
గుండెలో నున్నవీ ఎండమావులుకదా
క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
కోర్కెల ఊబిలో కూరుకుపోయె

అలసిపోయెను అతడు తలుపుదగ్గరనె
తలుపు తట్టుటమాని తనువుమరచాడు
నిలుచున్నపాళాన నిదురపోయాడు
నిదురలో నిడుపైన కలనుగన్నాడు
క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
క్లార్కు సూర్యారావు కలగన్నాడు

కలలోన సూరన్న తనయింటికొచ్చె
కష్టాలు నష్టాలు వెతలు. కన్నీళ్ళు
పుస్సెకట్టిన ఆలు పుట్టింటికేగె
పుట్టెడు సౌభాగ్యాలు స్వాగతముపలికె
క్లార్కు సూర్యారావు కలకలానవ్వె
మూలొక్కనెను మూలొక్కనెను ముచ్చటలుగాలి

కలలోన సూరన్న తలుపుతట్టాడు
నట్టింటిలోనుంచి నాతి ఒకతొచ్చె
వంటింటిలోనుంచి వనిత ఒకతొచ్చె
పడకగదిలోనుంచి పడతి ఒకతొచ్చె
క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
కమ్మగా నవ్వాడు కాంతలనుచూసి

కలలోన సూరన్న కనబడగానె
నట్టింటిలో చెల్లి నగలు తెమ్మనదు
వంటింటిలో వదిన వడ్లులేవనదు
పడకగదిలో భార్య పస్తుపడుకోనదు
క్లార్కు సూర్యారావు క్లార్కు సూర్యారావు
కడుపుసంతోషాన్ని కన్నాడుకలలో

కలలోన సూరన్న కనబడగానె
తన పిల్లలే తనను దెయ్యమనుకోరు
పొరుగింటిలోవాళ్లు భూతమనుకోరు
ఇరుగింటి వాళ్ళలోను ఈసడించేను
కలలోన కలలోన కలలోన మాత్రం
క్లార్కు సూర్యారావు కడుబలశాలి.
కలలోన సూరన్న గర్భశ్రీమంతుడు
అతగాడిపిల్లలకు ఆరోగ్యముండు

రస్కులు బిస్కట్లు చాకెట్లు తిండి
ఇస్కూలు జీతాన్ని ఫస్టునే కట్టు
క్లార్కు సూర్యారావు కడసారికొడుకు
మార్కులను తెస్తాడు ఫస్టునే ఎప్పుడూ

కలలోన సూరన్న కలవరించాడు
తలుపుదగ్గర అతడు పలువరించాడు
రోగిష్టి పెళ్లాము రొప్పుకొనివచ్చి
తలుపుతీసింది కన్ను మూసింది

క్లార్కు సూర్యారావు కరడుకట్టాడు
క్లార్కు సూర్యారావు మార్పల్కలేదు
క్లార్కు సూర్యారావు క్వొశ్చెన్‌మార్కు
క్లార్కు సూర్యారావు కాగితం కార్కు.

—"ఎన్.జి.వో. సూర్యుడు" నుంచి

# 'స్పెన్సర్ బ్రెడ్'

## దండమూడి మహీధర్

మాధవరావు పీడిమలుపు తిరుగుతుండగా మూలమీద కూర్చున్న కుంటి బిచ్చగాడు 'బాబూ!' అన్నాడు. వెనక్కు తిరిగి చూడనైనా చూడకుండా మాధవరావు పెద్దపెద్ద అంగలేసుకుంటూ వెళ్ళి రమణయ్యగారింటిముందు నిల్చున్నాడు. రమణయ్యగారి ఆవరణలో అడుగుపెట్టడానికి పూర్వం మాధవరావు చాలా మథనపడ్డాడు. కాని తప్పలేదు. లోనికెళ్ళాడు.

ఉదయంపూట మాత్రమేవచ్చి ట్యూషన్ చెప్పి వెళ్ళే మాష్టరు మాధవరావు సాయంత్రం నాలుగున్నర గంటల వేళప్పుడు - కాళ్ళకు చెప్పులులేకుండా, భుజంమీద చిరిగిన లాల్చీతో, పీక్కుపోయిన మొహంలో నీరసాలో ప్రత్యక్షంకావటం చూసి - సినిమాపత్రికలు తదేకదీక్షతో చదువుతున్న రమణయ్యగారి పన్నెండేళ్ళ కూతురు ప్రమీల, పక్కకుర్చీలో మహా ఠీవిగా కూర్చున్న రమణయ్యగారిసీనుకక్క 'షెల్లో', గాభరాపడి లేచి నిల్చున్నారు.

'ఈ బక్కమాష్టరుకు వేళాపాళా లేదా ఏమిటి?' అన్నట్టు మొహంపెట్టి ప్రమీల మాధవరావువేపు చూసింది. అల్లాచూస్తూనే తను చదువుతున్న సినిమా పత్రికలమీద పక్కనేవున్న 'హిందూ' పేపరు కప్పింది - ఎక్కడ తను పట్టుబడిపోతానో నని!

'నాన్నగారున్నారా అమ్మా?' అని అడిగాడు మాధవరావు.

'లేరండీ! మౌంట్‌రోడ్ వెళ్లారు! మా అమ్మకు కొంచెం సుస్తీ చేస్తే బ్రెడ్ తీసుకురావడానికి 'స్పెన్సర్స్'కు వెళ్ళారు. కూర్చోండి, వస్తూఉండాలి!' అని సమాధానం చెప్పిన ప్రమీల... 'కూర్చోండి!' అని ఎందుకు అన్నానా అని లోలోపల బాధపడింది. ఆయన నిజంగా వాళ్ళనాన్న వచ్చేదాకా అక్కడే కూర్చుంటే మట్టుకు తన సినిమా పత్రికల పఠనానికి భంగం కలుగుతుంది.

రమణయ్యగారు బ్రెడ్ కోసం మౌంట్ రోడ్ వెళ్లారంటే మాధవరావుకు ఆశ్చర్యం వేయలేదు. ఆయన అలవాట్లు చాలా విచిత్రంగా ఉంటాయి. తన కుండేటికి మూడే కాళ్ళంటారు. ఎదుటివాడు నోరు మెదపటానికి వీల్లేదు. ఇండియాలో తయారయిన వస్తువులు ఆయన చచ్చినా ముట్టుకోడు. ఎప్పుడూ బ్రిటన్, అమెరికా వస్తువులే కొంటూఉంటారు. అదేపనిగా విదేశీయుల్ని మెచ్చుకుంటారు; వాళ్ళనుంచి మనం నేర్చుకోవాలసిన విషయాలు చాలా ఉన్నాయని వాదిస్తూంటారు. మనదేశ పరిశ్రమల విషయంలో వాళ్ళ చేయూత లేకపోతే ఇంతటి అభివృద్ధిని మనం సాధించి ఉండేవాళ్ళం కాదట!

మాధవరావు ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు. షెల్లో అదేపనిగా అతనివేపుచూస్తోంది. ప్రమీల వాకిలి పక్కగా నిల్చుంది.

'ఏం లేదమ్మా! — రెండు రూపాయలు అడిగి పట్టుకెళ్దామని వచ్చాను! మీ నాన్నగారి స్వభావం నాకు తెలుసు!

ట్యూషన్ ఫీజు ఒకటో తారీఖున ముందు అడగటానికి వీల్లేదు. కాని తప్పలేదు... ఉదయంనుంచి మా ఇంట్లో పిల్లి లేవలేదు. చిన్న పిల్లగొడవ చేస్తోంది ఆకలికి' అన్నాడు మాధవరావు.

ఆ పిల్లకు పిల్లి లేవకపోవడమంటే ఏమిటో అర్థం కాలేదు. అథవా మాధవరావు విడమరచి చెప్పినా ఆ పిల్లకు ఆకలిలో అలమటించడం, కట్టుకోవడానికి బట్టలులేక పోవడంలాంటి విషయాలు అర్థం కాకపోవచ్చు! అర్థమయేట్టు చెప్పడం బహుశా మాధవరావుకు సాధ్యంకాదేమో?

మాధవరావు పక్క కుర్చీలో ఉన్న 'హిందూ' పత్రిక తీసుకోవడంతో—ఆ పిల్ల రహస్యంకాస్తా బయటపడింది!...

"అవండీ! అది పక్కింటి భ్రమరాంబ ఇచ్చింది లెండి! వాళ్ళనాన్న సినిమా యాక్టరు! మొన్న రిలీజయిన పిక్చర్... లో చాలా బ్రహ్మాండంగా అభినయించారండీ! నేను చూశా ఆ పిక్చరు...!" అని చెబుతూ ప్రమీల పత్రిక లన్నిటినీ లుంగ చుట్టి లోపలికి పట్టుకెళ్ళింది...

'తప్పునాదీ కాదు. భ్రమరాంబదీకాదు! రోజురోజుకూ పెరిగిపోతున్న సినిమా సంస్కృతీ ప్రభావమే ఇదంతా!' అని అనుకున్నాడు మాధవరావు మనస్సులో. ప్రమీలకు చదువు సంధ్యల మీద ఆసక్తి ఎలావున్నా - సినిమా పత్రికలంటే చెవి కోసుకుంటుంది. ఫేషన్స్ విషయంలో ఆసక్తి అధికం!

మాధవరావు 'హిందూ' పత్రిక పేజీలు తిరగవేయడానికి ఉపక్రమిస్తూన్న సమయానికే రమణయ్యగారి ఏకైకపుత్రుడు ప్రసాదరావు ఠీవిగా నడుచుకుంటూ లోనికొచ్చాడు. మాధవరావును చూసి... "ఏమండోయ్ మాష్టరుగారూ! ఈ వేళప్పుడు దయచేశారు మా ఇంటికి?...' అంటూ మాధవరావు సమాధానం చెప్పకమునుపే లోనికెళ్ళిపోయాడు. 'పెడ్రో' అమాంతంగా దూకి ప్రసాదరావును అనుగమించింది.

మాధవరావుకు పత్రికలో అక్షరాలు కన్పించలేదు. మాటిమాటికీ ప్రసాదరావు గుర్తుకొస్తున్నాడు. ఏ నిమిషంలోనైనా అతగాడు బయటికి దూకే ప్రమాదంఉంది.

ప్రసాదరావంటే రమణయ్యగారికి ఎంతో ప్రాణం. 'వీడున్నాడే - మావాడు, సరిగ్గా...రాజేంద్రప్రసాద్ పుట్టిన నక్షత్రంలోనేపుట్టాడు. వీడితల్లి ఆపేరే పెట్టుకున్నది. ఎవరో ఒకళ్ళిద్దరూకూడా — 'గొప్ప అదృష్టజాతకుడవుతాడని అన్నారు. చూడాలి మరి!' అని అంటూఉంటాడు. ప్రసాదరావు మాత్రం తనగదిలో ఎదురుగా తండ్రి కొనిపెట్టిన గ్రంథాలు పేర్చి-వాటిని నిత్యం పఠిస్తున్నట్లు నటిస్తాడు. పన్నెండు గంటలదాకా మేల్కొని ఉంటాడు! తండ్రి సంతోషిస్తాడు. నిజంగాఅతగాడు చదివేది మాత్రం డిటెక్టివ్ నవలలు! సరికొత్త పద్ధతులలో చక్కగా రకరకాల హత్యలను సృష్టించే నవలలు! ఆ నవల్లో రక్తపుమడుగులు, కళ్ళు చెదిరిపోయే కత్తులు - వళ్ళు జలదరించే దృశ్యాలు - చూస్తాడు. తెల్లవారిన తరువాత స్నేహితుల దగ్గర ఇతగాడు అచ్చంగా ఈ డిటెక్టివ్ పుస్తకాలలో పాత్రలు మాట్లాడే పద్ధతిలోనే ముదరామాటలు మాట్లాడతాడు. ఇంగ్లీషు ట్యూషన్ మాష్టరు దగ్గరికెళుతున్నానని తండ్రితో చెప్పి - స్నేహితులతో ఆదివారంనాడు క్రైంపిక్చర్స్ చూసివస్తాడు. వేషధారణ విషయంలో రోజుకొక పద్ధతి

అవలంబిస్తాడు. ఇలాంటి విషయాలమీద ఆసక్తి ఉండటం మంచిదిగాదుబాబూ! అని ఒకసారి మాధవరావు చెప్పగా - ఆరోజు సాయంత్రం బజారులో నిలేసి 'జాగ్రత్తగా మసులుకో పంతులూ!' అని హెచ్చరించాడు! అంతే! మాధవరావు జీతం రాళ్లకోసం తన పని తాను చేయటం వినా... మరో విషయాన్నిగూర్చి మాట్లాడటమే మంచిదిగాదని మౌనం వహించాడు.

ప్రసాదరావు బయటికొచ్చి ఎలాంటి ప్రశ్నలువేసి తనను వేధిస్తాడోనని ఆలోచనలలో మునిగివున్న మాధవరావు అకస్మాత్తుగా రమణయ్యగారు గేటు తోసుకొని లోపలికి రావటం చూశాడు. అసలు విషయం ఆయన ఎదుట ఎలాఉండాలో ఒకటికి నాలుగు పర్యాయాలు అనుకున్నాడు మనస్సులో!

'ఏం పంతులూ ఇలావచ్చావు?' అని రమణయ్యగారు అడుగుతారు గాబోలని మాధవరావు ఊహించాడు. కాని అలా అడగలేదు.

'ఇదుగో పంతులూ!... ఇది స్పెన్సర్ బ్రెడ్!' రమణయ్యగారి గొంతువిని లోపట్నుంచి 'పెడ్రో' పరుగెత్తుకొచ్చి ఆయన కాళ్ళను చుట్టేసుకుంది! ప్రమీలవచ్చి గడపలోనిల్చుంది... 'ఈ బ్రెడ్ తీసుకొని బస్‌స్టాప్‌కొచ్చి నిలబడ్డాను. బస్ ఎంత సేపటికీ రాదు. ఏమంటావు పంతులూ... మనకు తొందరగా ఉన్నప్పుడు మనకు కావలసిన బస్సులు మినహా అన్నీ వస్తాయి గదూ?......'

'అవును!' అన్నాడు మాధవరావు! ఆయన మళ్లా ప్రారంభించాడు - 'అర గంటకు పైగా నిల్చొన్నాను. నా వెనుక పదిమంది క్యూలో వున్నారు. కాళ్ళు పీక్కు పోతున్నాయి. అప్పుడు అకస్మాత్తుగా నా చేతిలోనుంచి స్పెన్సర్ బ్రెడ్ కాస్తా కిందపడింది. నువ్వేచెప్పుపంతులూ... బస్‌స్టాప్‌లో కిందపడ్డ బ్రెడ్ తీసుకోవచ్చా? తీసుకోకూడదు. అక్కడ ఎంత మంది నిల్చున్నారో, ఎంతమంది ఉమ్మి వేశారో... అలాంటిచోట ఎన్ని వ్యాధులకు సంబంధించిన క్రిమికీటకాలుంటాయో కద!... కాని 'క్యూ'లో నా వెనక నిల్చున్న వ్యక్తి కిందపడ్డ బ్రెడ్ తీసుకొని నా చేతికందిస్తూ - 'అదేమిటండీ! స్పెన్సర్ బ్రెడ్ కిందపడితేతీసుకోరు?...ఎంతమంచి బ్రెడ్ ఇది!' అనటంతో తీసుకోక తప్పింది కాదు!...కాని దీనికి టి. బి. కి సంబంధించిన రేణువులంటుకొని ఉంటే ఏం గావాలి? ఎంత ప్రమాదం?... మళ్ళా ఇంకో బ్రెడ్ తీసుకుందామనుకున్నా; కాని అలా వెళ్తే ఇంకోగంట ఆలస్యమవుతుంది!... విధిలేక వచ్చేశాను. బస్‌దిగి వచ్చేటప్పుడు అడుక్కునేవాళ్ళ కెవరికయినా ఇద్దామనుకున్నా, కాని... వాళ్ళకు మాత్రం వ్యాధులు సంక్రమించవూ?...ఏమంటావు?' అని అడుగుతూ ముగించారు రమణయ్యగారు!

మాధవరావుకు కోపం వచ్చేట్లున్నది. భార్యా పిల్ల ఏంజేస్తున్నారోనని బాధగా ఉంది. కాని తనబాధ కన్పించనీయకుండా రమణయ్యగారి ఎదుట నవ్వుతూ నిల్చున్నాడు.

రమణయ్యగారు బ్రెడ్ వసారామూల నున్న బల్లమీదికి గిరాటేశారు. 'పెడ్రో' దాన్ని పట్టుకోబోతే వారించారు. అది వెనక్కువచ్చి బ్రెడ్‌వేపు తదేకంగా చూస్తోంది. రమణయ్యగారికి ఇంకా సమస్యగాఉంది. మాధవరావు - రేపు ఇచ్చే

ట్యూషన్‌ఫీజు ఇవ్వాలో ఇప్పుడనియూ అడగాలో ఇంకా ఆలోచిస్తూనే 'ఇదుగో పంతులూ! ఆలోచించి చెప్పు - ఏంచేయమంటావు ఈ బ్రెడ్‌ని? బజారులో పారేయమంటావా?' అని అడిగారు రమణయ్యగారు.

'ఆఁ వద్దండీ! నా కివ్వండి! వీధి మలుపుమీదకూర్చున్న కుంటివాడి కిచ్చేస్తాను. మీ పేరు చెప్పుకొని తింటాడు!' అన్నాడు మాధవరావు!

'వాడికి టి. బి. వస్తేనో?'

'అసలు బీదవాళ్ళకు జబ్బులు వచ్చేది తిండితినక పోవటంవల్లనేనండి! ఒకవేళ తింటే మళ్ళీ కంపుకొట్టే ఆహారం తింటారు. కుక్కలకుమల్లే ఎంగిళ్ళకోసం తొక్కిసలాడుకుంటారు. మీరు విచారించకండి ఈ బ్రెడ్ తీసుకెళ్ళి ఆ కుంటివాడికిస్తాను. మీ రనుకునే జబ్బులేవీ వాడికంటవు.'

'సరే అయితే - తీసుకెళ్ళు' అనిచెప్పి రమణయ్యగారు ఆ బల్లమీదున్న బ్రెడ్ మునివేళ్ళతో పట్టుకుని మాధవరావు కందించాడు.

మాధవరావు మారు మాట్లాడకుండా తీసుకున్నాడు.

రమణయ్యగారు లోనికెళ్ళిపోయాడు. మాధవరావు నోట్లోనుంచి మాటరాలేదు. అంగులో అడుగువేసుకుంటూ బయటికి నడిచాడు.

మాధవరావు వీధిమలుపుతిరగటంతోనే మూలమీదకూర్చున్న కుంటివాడు అరగంట క్రితంకుమల్లే 'బాబూ' అని దీనంగా పిలిచాడు. రమణయ్యగారిచ్చిన 'స్పెన్సర్ బ్రెడ్' అతని చేతి కందించబోతూండగా... మాధవరావుకు తన ఐదేళ్ళపిల్ల గుర్తొచ్చింది. 'ఎక్కడైనా రెండు రూపాయలు పట్టుక రండి... బియ్యం, ఉప్పూ-పప్పూ తెస్తాను' అని కనీసం నాలుగైదు పర్యాయాలు తనను ప్రార్థించిన భార్య స్మృతిపథంలో మెదిలింది.

మాధవరావు కటిక్కున తనచెయ్యి వెనక్కులాక్కొని... ఇంటివైపుకు గబగబా నడిచాడు. వెనకనుంచి ... 'బాబూ, బాబూ, ఉదయంనుంచీ ఏమీ తినలేదు' అనే కుంటివాడి మాటలు మాధవరావుకు విన్పించాయి. కాని వాటిని అతను విన్పించుకోలేదు.

'ఏమైనా తెచ్చారా?' అన్నది మాధవరావు భార్య!

''ఇదుగో! స్పెన్సర్ బ్రెడ్' తెచ్చాను. ఈ పూటకు దీంతో కాలక్షేపం చేద్దాం. రేపటి విషయం రేపు' అన్నాడు మాధవరావు.

మాధవరావు కూతురు నిద్రపోతోంది. 'నాడమ్మా... మీ నాన్నగారు నీకోసం మంచి బ్రెడ్ తెచ్చారు' అని లేపింది. మాధవరావు చాకుతో దాన్ని ముక్కలు ముక్కలుగా కోశాడు. వంటింట్లోనుంచి మూడు ప్లేట్లు తెచ్చి వాటిలో ఆముక్కలు పేర్చాడు.

ముగ్గురూ ఎదురెదురుగా కూర్చొని... స్పెన్సర్ బ్రెడ్ ముక్కలు తినటానికి ఉపక్రమించబోతున్న సమయానికే ఎవరో వచ్చిన చప్పుడయింది. ఆ వెంటనే - 'ఏయ్ పంతులూ' అన్న కేక విన్పించింది.

మాధవరావు ఉలిక్కిపడ్డాడు. ఆ గొంతు రమణయ్యగారిది.

'ఏమండీ' అని బయటికి వచ్చేలోపలే రమణయ్యగారు లోనికొచ్చారు. మూడు పళ్ళేలలో బ్రెడ్ ముక్కలు తరిగివుండటం చూశారు. అల్లంత దూరాన - 'స్పెన్సర్

# సాహిత్యాభిలాష

## కొడవటిగంటి కుటుంబరావు

ఈనాడు ఆంధ్రలో సాహిత్యాభిలాష చాలా హెచ్చుగా ఉన్నదనటానికి సందేహంలేదు. సినిమా చిత్రాలు జనాన్ని ఎంతగా ఆకర్షిస్తున్నాయో, పుస్తకాలూ పత్రికలూ మొదలైనవికూడా అంతగానూ ఆకర్షిస్తున్నాయి. (అక్షరాస్యులతో పోలిస్తే నిరక్షరులు ఆరేడింతలుంటారన్నది జ్ఞాపకం ఉంచుకోవాలి.) చిత్ర నిర్మాతల సంఖ్యకన్న దేశంలో పుస్తక ప్రకాశకుల సంఖ్యే హెచ్చుగా ఉన్నది. పెట్టుబడిపైన చిత్రనిర్మాతలు తీసేరేటున పుస్తకప్రకాశకులు కూడా లాభాలు పొందుతూనే ఉన్నారు.

కాని ఈ సాహిత్యాభిలాష భవిష్యత్తుకు ఏవిధంగా ఉపకరిస్తుంది? నానాటికీ హెచ్చే పుస్తకపఠనంవల్ల పాఠకులు జీవితాన్ని ఎంతవరకు కరతలామలకం చేసుకోగలుగుతున్నారు? ఇవి తెలవలిసిన విషయాలు. ఎందుచేతనంటే ప్రకృతి రహస్యాలను బట్టబయలు చెయ్యలేనిది శాస్త్రవిజ్ఞానం కాదు; జీవితశ్రమను తేలిక చెయ్యలేనిది "ఇన్వెన్షన్" కాదు; జీవితపు మారుమూలలలోకి వెలుగు తీసుకురాలేనిది సాహిత్యం కాదు.

నా అనుభవంలో ప్రస్తుతం ఆంధ్రలో

---

బ్రెడ్' పైకాగితం ఎగిరెగిరి పడుతోంది. మాధవరావు పదేళ్ళకూతురు బ్రెడ్ ముక్క కొంచెం కొంచెంగా నములుతోంది.

'కాస్త బయటికొస్తావా పంతులూ' అన్నారు రమణయ్యగారు కొంచెంకోపంగా.

మాధవరావుకు వణుకు పుట్టింది.

'ఏమయ్యా, ఆ బ్రెడ్ వీధి మలుపు మీదున్న కుంటివాడి కిస్తాననిచెప్పి ఇలా చేశావేం?... వాడిదగ్గరనుంచి ఆ బ్రెడ్ లాక్కెళదామని వచ్చాను. నువ్వు బ్రెడ్ వాడికి చూపించి తీసుకొచ్చావట.

...ఆ కోసిన బ్రెడ్ ముక్కలిలాతీసుకొచ్చి బయట పారెయ్... నీకు జబ్బు చేస్తే నా పిల్లలకు చదువెవరు చెబుతారు?

...అయినా డబ్బు అడగటానికివచ్చిన వాడివి మారు మాట్లాడకుండా తిరిగొచ్చావేం?... నోరుగలవాడిదయ్యా రాజ్యం...

ఈ రోజుల్లో ముంగిలా ఉంటే లాభం లేదు.... ప్రమీల చెప్పింది నువ్వు డబ్బు కోసం వచ్చావని. ఇదిగో ఈ పదిరూపాయలు తీసుకొని వెంటనే ఇంట్లోకి కావలసిన సామాన్లు తీసుకురా' అని చెప్పి - రమణయ్యగారు మాధవరావు చేతికి పదిరూపాయలనోటు అందించి వెంటనేవెళ్ళి పోయారు. మాధవరావు నోటివెంట మాటరాలేదు.

—o—

ఉండే సాహిత్యాభిలాష అధికంగా రెండు నిర్జీవమైన పొరలను అంటిపెట్టుకునిఉన్నట్టు కనిపిస్తుంది. ఒక పొరకుచెందిన సాహిత్యాభిలాషులు పాతకాలుకు చెందినవాళ్ళు. రచయితగా దేశంలో గణనపొందిన ప్రతివాణ్ణీ వాళ్ళు ఎంతో ఆదరంతో చూస్తారు. రచనా సామర్థ్యం పూర్వ పుణ్యం చేతగాని లభించదనీ, అది లభించాక ఆ రచయిత ఏమి రాస్తున్నాడనేది అటే పరిగణించదగిన విషయంకాదనీ ఈ తరగతి సాహిత్యాభిలాషుల అభిప్రాయంగా కనబడుతుంది. వేదవ్యాసుడు లగాయతు ఈనాటి బాలకవివరకూ ఒక పరంపర అని వారి ఉద్దేశం.

వీరిది నిర్జీవమైన సాహిత్యాభిలాష అనటానికి సందేహం ఎంతమాత్రమూ లేదు. ఎందుచేతనంటే సమకాలిక రచయితను సమకాలిక జీవితపు కొలబద్దతో కొలవని వాళ్ళు ప్రాచీన రచయితలను వారికాలపు జీవితపు కొలబద్దలతోగాని, నేటికాలపు జీవితపు కొలబద్దలతోగాని కొలుస్తారని నమ్మకం ఏమీలేదు. వారికి సాహిత్యం వేరే ప్రపంచం.

ఇక రెండో పొరలో అత్యధిక సంఖ్యాకులైన ఆధునిక యువతీయువకు లున్నారు. వీరికి సాహిత్యం ఒక వినోదకళ, సినిమాలాగే, సినిమా పాటలలాగే! వీరు పుస్తకాలనుంచి అటే ఆశించరు రెండుగంటల కాలక్షేపం తప్ప. ఆ పుస్తకాలలోనుంచి ఒక్క జీవితసత్యాన్నికూడా వారు సంగ్రహించగోరరు, అవి తమ నిత్యజీవితానికి ఏమాత్రమూ ఉపకరించకపోతే వారికి చింత లేదు. నూరు పుస్తకాలు చదివిన అనంతరం కూడా వారికి జీవితం ఎప్పుడూ ఉండినంత అయోమయంగానూ ఉంటేకూడా వారికి "ఇదేమిటి ?" అనిపించదు... వీరిలో చాలామంది అట్టమీది బొమ్మనుచూసి పుస్తకాన్ని కొంటారు. వినోదం గ్యారంటీ ఉన్నప్పుడు రచయితపేరు చూసికూడా కొంటారు. అటువంటి రచయితలు "స్టార్ వాల్యూ" కల వాళ్ళన్నమాట.

వ్యక్తితత్వం, సంఘతత్వం, లౌకికజ్ఞానం మొదలైనవి ఏమీ లేకుండానే కొందరు రచయితలు "స్టార్ వాల్యూ" సంపాదించుకునే అవకాశం లేకపోలేదు, - వారు తమ రచనలద్వారా పాఠకులకు వినోదం ఇవ్వగలిగితే.

ఈనాడు ప్రచురితమయ్యే సాహిత్యంలో హెచ్చుభాగం - చాలా హెచ్చుభాగం వినోదంఇచ్చే సాహిత్యం. డిటెక్టివ్ నవలలన్నీ ఇదేతరగతికిందికి వస్తాయి. వీటిని చదివేవాళ్లనూ చదివి నిజంగా ఆనందం పొందే వాళ్లనూచూసి తప్పుపట్టటం అనవసరం. కళలద్వారా వినోదం సంపాదించాలనే కాంక్ష ఒక విధమైన బాల్యదశను సూచిస్తుంది. ఈ దశలో వున్నవాళ్లకు నచ్చని సినిమాచిత్రాలు విమర్శకుల ప్రశంసలను అందుకున్నప్పటికీ ఆర్థికంగా దెబ్బతినటం మనం చూస్తున్నాం.

కాని ఈ "బాల్యదశ" నుంచి ప్రతి పాఠకుడూ ఎప్పుడో ఒకప్పుడు బయటపడతాడు. ఆ తరవాత అతను అసలు పుస్తకాల మొహమే చూడకుండా పోతాడో, నిజమైన సాహిత్యాభిలాష అలవరచుకుంటాడో నిర్ణయించే అంశాలు అనేకం ఉంటాయి.

అయితే నిజమైన అనగం సాహిత్యాభిలాషుల బాల్యదశ కానేకాదు - తీయకుండా ఎల్లప్పుడూ ఆదశలో కొన్నిలక్షల మంది ఉంటూనే ఉంటారు; నిజమైన అనగం సాహిత్య కృషిచేయగల వాళ్ళుకూడా "స్టార్ వాల్యూ"కోసమో, ఆర్థికలాభం

కోసమో వినోదసాహిత్యం సృష్టించటం; దేశంలో ఉన్న పత్రికలు ఒక్కొక్కటే ఈ రకం సాహిత్యాన్ని "గురించి" ఆదరించటం; వినోద సాహిత్యంధాటికి తట్టుకోలేక నిజమైన సాహిత్యం తోకముడవటం.

ఇవి నిజమైన అనర్థాలు. వీటివల్ల సాహిత్యం భవిష్యత్తుకు ప్రమాదం ఉంది. "ప్రజలకు అక్కర్లేని సాహిత్యం సృష్టించి ఏం లాభం ?" అని వాదించవచ్చు. రాజకీయ రంగంలో ఇదే వైఖరి అవలంబించటాన్ని **Trailing behind the masses** అంటారు. అటువంటి వైఖరివల్ల రాజకీయ నాయకత్వం ఎలా రాణించకుండాపోతుందో సాహిత్యరచనకూడా అలాగే రాణించకుండా పోతుంది. అత్యధిక సంఖ్యలో అమ్ముడుపోయే పుస్తకం అత్యుత్తమ ప్రజా సాహిత్యం అవుతుందనుకోవటం భయంకరమైన పొరపాటు.

ఇంతకు ముందుచెప్పిన రెండు పొరల సందున సాహిత్యాభిలాష పేరిట చాలా కల్మశం ఉన్నది. దాన్నిగురించి తెలుసుకోవటం అవసరం. ఈకల్మశాన్ని భద్రంగా రక్షించేవారిలో ఒక తెగ "కళకోసమే కళ" అని వాదించేవాళ్ళు. వీళ్ళు మూగవాళ్ళు మటుకు కారు; కాలికీ వేలికీవేసి, కొంత హేతువాదమూ, కొంత కృతక అభ్యుదయవాదమూ, కొంతఆదర్శవాదమూ ఒకదాని కొకటి మాటుపెట్టి జొల్లిమాటలతో సాహిత్యం "ఉత్తేజపరచాలి" అనీ, దాని ఆశయం "అనిర్వచనీయానందం" అనీ అది (ఎవరినో, ఎలాగో) "క్షాళనం" చేస్తుందనీ చెప్పినట్టు చెప్పకుండా చెప్పి, చిట్టచివరకు "కళ నిష్ప్రయోజనం" అని తేల్చి మొండి చెయ్యి ప్రదర్శిస్తారు. చదవటానికి ఆనందకరంగా ఉన్నదల్లా "కళకోసమే కళ" అన్న వాదాన్ని బలపరుస్తుందని వీళ్ల మూఢవిశ్వాసంలాగా కనబడుతుంది. అక్కరవంతంగా ఉండటానికి అడిగి ఏంచేసినా తప్పేఅని మా అన్నగార్లకాలంలో వాళ్ళు అనుకున్నట్టుగా.

సాహిత్యాభిలాషను కళ్మలంగా మార్చిన మరొక తరగతివాళ్ళున్నారు. వాళ్లు ప్రత్యేక రాజకీయ వాదాలకు సాహిత్యాన్ని వాహనంగా ఉపయోగించాలని అభిలషించేవారు. వీరిలో కమ్యూనిస్టు అభిమానులూ ఉన్నారు, కమ్యూనిస్టు వ్యతిరేకులూ ఉన్నారు. కొంతకాలం కమ్యూనిస్టు అభిమానులుగాఉండి అకస్మాత్తుగా కమ్యూనిస్టువ్యతిరేకులైనవారూ ఉన్నారు.

ఒక రాజకీయ పక్షానికి చెందినవాళ్ళు జీవితరంగంలో తాముసాధించదలచినపరిణామాలను సాహిత్యంగాని, ఇతరకళలుగాని బలపరచినప్పుడు ఆనందం కలగటంలో తప్పేమీలేదు. అటువంటి దౌర్బల్యంనాకే ఉన్నది. మార్క్సిస్టు సిద్ధాంతాలలో సంపూర్ణమైన విశ్వాసంగల నాకు ఆ సిద్ధాంతాన్ని నిరూపించే, బలపరిచే, ఉదహరించే రచన ఎక్కడ తగిలినా ఎంతో ఆనందంగా ఉంటుంది. అసేవిశంగా, అహింసద్వారా సాంఘిక పరిణామాలన్నీటినీ సాధించవచ్చుననే విశ్వాసం కలవాడికి అహింసయొక్క విజయాన్ని చిత్రించే ప్రతిరచనా అపారమైన సంతృప్తినిస్తుంది. కాని నా విశ్వాసాలను బలపరిస్తే చాలు అది ఉత్తమ రచనే అని నేను అనలేను. సాహిత్యకారుడుగా నాకు ప్రమాణం జీవితం. సిద్ధాంతం కోసంజీవితాన్ని వక్రంగాచిత్రిస్తే ఆ రచన ఉత్తమరచన ఎట్లా అనిపించుకుంటుందో నాకు ఏనాడూ అర్థం కాలేదు.

నిజం చెప్పాలంటే కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారార్థం సృష్టిఅయిన సాహిత్యంలోకూడా ఈ విధంగా జీవితాన్ని వికా

రంగా చెయ్యటం నాకు కనబడింది.

ఈ వక్రించిన జీవితాన్ని చిత్రించే రచనలను ఎవరు చదువుతారు? అవి ఎవరిహృదయాలను మారుస్తాయి? తమ రాజకీయ విశ్వాసాలను పురస్కరించుకుని మెచ్చుకునే వారిపైనకూడా అటువంటి రచనల ప్రభావం ఉండదు.

మనం నమ్మే సిద్ధాంతాలు సరిఅయినవి అయితే, అవి సరిగా వున్నంతమేరకు, వాస్తవ జీవితం వాటిని గట్టిగా బలపరుస్తూనే వుంటుంది. అందుచేత రచయిత జీవితాన్ని ఆ సిద్ధాంతాల ఆధారంతో అర్థం చేసుకుంటే చాలు జీవితసత్యాలను అవలీలగా వ్యక్తం చేయగలుగుతాడు.

దేశంలో సరిఅయిన సాహిత్యాభిలాష పెంపొందించటం ఉత్తమ సాహితీపరుల ప్రధాన కర్తవ్యం. ప్రత్యేకించి అభ్యుదయ రచయితలు ఇందుకోసం సర్వతోముఖ కృషిచెయ్యాలి.

నిజానికి వాస్తవమైన సాహిత్యాభిలాష ఎవరికి కూడా సులువుగా, సహజంగా, దానంతటఅదేరాదు. అందుకోసం పాఠకులుకూడా కొంత కృషిచెయ్యాలి.

ఒక్క చిన్న వుదాహరణ తీసుకుంటాను. "కన్యాశుల్కం" ఆబాలగోపాలం చదివి ఆనందించటానికి వీలయిన నాటకం. (నేను దాన్ని మొదటిసారి ఆరోక్లాసులో, ఏడోక్లాసులో చదివినట్టు గుర్తు) కాని అది చదివి ఆనందించగలవాళ్లలో దానిసారం పూర్తిగా గ్రహించగలవాళ్ళూ, దాని ద్వారా రచయిత వ్యక్తం చేయదలచిన సాంఘిక సత్యాలనూ, ఆ నాటకంయొక్క సాంఘిక ప్రయోజనాన్ని పూర్తిగా గ్రహించగలవాళ్ళూ ఎందరుంటారు?

ఏ పుస్తకాన్నిగాని పూర్తిగా జీర్ణించుకోవటం చాలా కష్టమైనపని. మంచిపుస్తకాలన్నీ "కన్యాశుల్కం" నడిచినంత సరదాగా నడవలేవు. పుస్తకంద్వారా రచయిత హృదయాన్నీ, సంస్కారాన్నీ, ఆశయాలనూ అవగాహన చేసుకోవటానికి చదివే పద్ధతేవేరు. ఆ పద్ధతి అలవరచుకోవటమే నిజమైన సాహిత్యాభిలాష.

మాతరం వాళ్లం అదృష్టవంతుల మనుకుంటాను. మాకు సాహిత్యగోష్ఠిలో ప్రాచీనకవుల పద్యాలూ, శ్లోకాలూ మాత్రమే తరచటం జరిగేది. అయినప్పటికీ ఒకవిధమైన రసపిపాస తలఎత్తినాక మాకు రచయిత హృదయపు లోతులు అన్వేషించటం ఒక మానసిక వ్యాపకం అయిపోయింది. ఇటువంటి వ్యాపకంలేనిదే అభ్యుదయ సాహిత్యం వెంటఉండే అభ్యుదయ సాంఘిక ప్రయోజనమూ, ఆసాహిత్యం ఇచ్చే ముందుచూపూ అలవడవు. దుష్టశిక్షణ జరిగిందన్న సంతృప్తికోసంమాత్రమే అయితే రామాయణం చదవ నవసరంలేదు. అట్లాగే, ఉన్నవాళ్లు లేనివాళ్లపట్లద్రోహం గాప్రవర్తిస్తారనేది మాత్రమే తెలుసుకోవటానికే అయితే అభ్యుదయ సాహిత్యం చదవనవసరంలేదు. ఉండటం లేకపోవటం మధ్యగల తారతమ్యం ఉన్నవాళ్లను ఎట్లా మారుస్తున్నదీ లేనివాళ్లను ఎట్లా మారుస్తున్నదీ చూపితేనేగాని జీవితసత్యం వ్యక్తం కాదు. అందుకే నినాదాలు సాహిత్యసృష్టికి ఆధారభూతాలుగా పనిచెయ్యలేవని నేను గట్టిగా నమ్ముతూ వస్తున్నాను.

సాహిత్యాభిలాష పెరగాలంటే సాహిత్యగోష్ఠుల సంప్రదాయంకూడా ఏర్పడాలి. (చవుకబారు సాహిత్యంచదివే వాళ్లు చదివినవెంటనే పుస్తకాన్ని మరచిపోవటానికి యత్నిస్తారు.) మంచిపుస్తకాలు కొందరి మనస్సులకైనా జిడ్డులాగా పట్టుకోక

తప్పదు. వారే ఇతరులలో సాహిత్యాభిలాష పెంపొందించాలి.

విమర్శనాశక్తి పెరిగితేనేగాని సాహిత్యాభిలాష పెరగదు. (నేను మొట్టమొదట పేర్కొన్న సాహిత్యాభిలాషులలో విమర్శనాశక్తి నామాపు ఏమీ లేనట్టే కనబడింది) విమర్శనాశక్తి లేకుండానే పుస్తకాలను మెచ్చుకునేవాడు ఆ పుస్తకంవల్ల తాను ప్రయోజనం సాధించలేడు సరికదా ఇంకొకరు లాభం పొందేటట్టుకూడా చెయ్యలేడు.

చదవటానికి మాత్రమే పనికివచ్చి నలుగురితో చర్చించటానికి పనికిరాని పుస్తకం ఏమంత చెప్పుకోదగిన పుస్తకంకాదు.

సామాన్యంగా సాహిత్యాభిలాషులు - కనీసం సాహిత్యాభిమానులమనుకునేవారు- వాళ్ళ ఊళ్ళో ఒక సంఘం ఏర్పాటు చెయ్యటం, వీలయినప్పుడల్లా ఒక పేరుమోసిన రచయితను పట్టుకొచ్చి మాట్లాడించటం, లేకపోతే ఏ కవిచేతనో కొన్ని పద్యాలూ, గేయాలూ చదివించటం, ఉత్సాహం పుట్టినప్పుడు ఎవరినో పట్టుకొచ్చి సన్మానం జరపటం, చాలా గొప్పపని చేశామనుకుని ఎవరిదారిన వారు వెళ్ళిపోతుండటం పరిపాటిగా వుంటున్నది. ఇది సాహిత్యాభిలాషను పెంపొందించే కార్యక్రమంలో ప్రధానాంశం ఎంతమాత్రం కాదు. నిజమైన సాహిత్యాభిలాష ఇంకో పరిమితమైన వలయంలో, నలుగురైదుగురి మధ్య గోష్ఠి రూపంలో ప్రారంభమవుతుంది. పుస్తకాల మంచిచెడ్డలూ, మంచిపుస్తకాలలో వుండేసారమూ, ఒక్కొక్క రచయితలో జరిగే పరిణామమూ, వేరువేరు రచయితల దృక్పథాలలో, కావ్యవస్తువులలో వుండే తేడాలూ - ఇటువంటివాటినిగురించి చర్చించటంలో సాహిత్యాభిలాషకు సరిఅయిన పునాది పడుతుంది. సాహిత్యాభిలాష పెంపొందించుకోగోరేవారునన్నయ మొదలు దాశరథిదాకా అందరు కవుల రచనలనూ చదవవచ్చు. ఆధునిక సమస్యలు వెంట వుండే సంకుచిత భావాలూ, వైషమ్యాలూ బాధించవు గనక సాహిత్యాభిలాష తెలుగు భారతంతోనే ప్రారంభించటం వుత్తమోత్తమం. ఇటువంటి సాహిత్యాభిలాషజనసామాన్యాని కంతటికీ అందుబాటులోకి వస్తుందా అని కొందరికి శంకకలగవచ్చు. సాహిత్యంచదివే విరామండున్న ప్రతివాడికీ సాహిత్యంగురించి తెలుసుకునే అవకాశం వుంది. ఎన్ని పుస్తకాలు చదివామన్నది ముఖ్యం కాదు, చదివిన పుస్తకాలు ఎంతబాగా చదివామన్నదే ప్రశ్న. లేనిపక్షంలో సాహిత్యాభిలాషకు ప్రయోజనమే వుండదు.

—o—

"పలుకఁగవలె ననరసములు
గులుకం బద్యములు చెవులకుఁ హృద్యముగా
నలుకకయుంగాకున్నం
బలుకఁగ యుండుటయె మేలు, బహుమానముగఁ".
"చెప్పనలె కప్పురంపోలు
కుప్పలుగా బోసినట్లు, గుంకుమపైపై
గుప్పినక్రియ, విరిపొట్లము".
విప్పినకతి. ఘుమ్మనన్ కవిత్వము సభలన్."

రఘునాథరాయులు.

# హిమజ్వాల

## "మధుబాబు"

ఈనడిరాతిరి, మిట్టమధ్యాహ్నపు వేళలలో పయనించేది ఎటు?
నిప్పురవ్వలచీకటి రాళ్ళవర్షంలో తడిచి ముద్దవటం ఎందంకా?
భాగ్యరేఖల చేతులు నిర్భాగ్యుడి దవడమీద దబాయించికొడుతూన్న
యిప్పుడు
ఎవడబ్బా నిబ్బరంగా ఎండకాలపు మబ్బులావుండేది!
జీవితాకాశంలో నక్షత్రాలు రాలిపోతున్న అదునుచూసి
పక్షులుగూళ్ళు కట్టుకుంటూన్న యిప్పుడు
అక్షులు ఎలా వీక్షించగలవు మునుపటిలా!
ఈ తొలకరించిన ఎముకలు కొరికే చలికాలపు వేకువలో లేచి
బట్టలు విప్పుకు ఆరుబయట ఎప్పటిలా ఎలా పళ్ళికిలించగలదువాళ్ళు!
అనుక్షణం ఆకటిచీకటి ఘాటికి తాళలేకపోతూవుంటే
యిందులో, యీలోకంలో,
శాధలుగా, గాధలుగా, కర్మలుగా, ధర్మాలుగా, సాంప్రదాయాలుగా,
ఛాందసాలుగా. మర్మాలుగా, మానవమృగాలూ
పీల్చిపిప్పిచేస్తున్న యీ లోకపు పరదాకొంగు ఎత్తి
తొంగిచూడబోతున్నది అణుబాంబు
అని అనటం
ఎవడో పిల్లాడు ఆటకోసం కట్టుకున్న పాటలాటిది కాకమరేమిటి!
అన్నంతమాత్రాన యిక్కడ ఏమీలేవన్నానని అనుకోకు
వున్నవి; వున్నవి, నాయనా ఎన్నో వున్నవి.
మానవఫణిరాణుల తలలమీద మణులు లేనేలేవని
ఎవడూ అనటంలేదు, ఎవడూ అనటంలేదు.

ఆ మణులమహోజ్జ్వలజ్వాలల్లో ప్రతి నిమిషం
మాడిమాడి మసిబొగ్గై పోతున్న మనం
అవిలేనే, లేనని అనుకోవటం
పెద్దతప్పుమాట అటుంచి నిద్దరలో ఐనా వృద్దేసించేది ఎలా!
ఈ జ్వాలల్లోకి యీ బాలకౌగిటిలోకి
ఎగబ్రాకబోతున్నది అణుబాంబు
అని అనుకోవటం పరిపూర్ణం పొందినభ్రమ!
ఇది రాణులపనికాదు
ఇది అణుబాంబుల పనికానేకాదు.
ఈ రాణుల మణులమంటలు చల్లార్చాలంటే,
అందరికీ అందించాలంటే
మరెవడిచేతనో కాదు.
ఆదివ్యశక్తిచేత అసలేకాదు.
అసలు దివ్యమనేది ఎక్కడో ఆకాశంలో తైతక్కలాట్టంలేదు.
అసలు దివ్యమనేది భువిలోని సామ్యవాదప్రభావమే!
ఈ దివ్యమనే సామ్యవాదంరమ్యంగా రాజ్యంచేయాలంటే
అభ్యుదయం వర్ధిల్లాలంటే
నువ్వూ నేనూ, తల్లీ, పిల్లా, తండ్రీ, కొడుకూ,
అంటే అందరం, మనమందరం
పందెంవేసుకు యిందులోకి దుమకాలి.
రంకెవేసి ఆకుంకల మదమణచాలి.
ఆమూల, మరీమరీమూల
ఎన్నోశతాబ్దాలవెనకటి గద్దెమీద కూర్చున్న పెద్దమనిషి
ఆశయాలువుంటవి, భాయీూవుంటవి, ముద్దుముద్దుగానే.
కానీ కొద్దిగా ఆలోచించు అవిసాధ్యం అవుతయ్యాలేదా అని.
తల్లక్రిందులుగానడవక [illegible] టగానూ, అఘోరకంగానూ వుంటం
నిజమే.
కానీ అంతాకాద [illegible] ంలాంటిది.

రాజ్యాలమాట అటుంచి ఆఖరికి అన్నపుముద్దైనా పెట్టవు.
ఎవడో ఆప్తుడు, మన ఆప్తుడు అన్నట్టు, గట్టిగా చెప్పినట్టు
ఉదయంగానే కాదనుకోవటం నిరాశ, మున్ముందటికీ నిరాశ.
జాగృతి మన ఎదలో ఎప్పుడూ పొంచివుంటుంది.
ఆకృతి ఎప్పుడూ, ఎల్లప్పుడూ ధరిస్తూనేవుంటుంది.
యీ కుళాయికింది బిందెలు ఎల్లప్పటికీ యిలాగే పడిగాపులుపడుతూ వుంటయ్యనుకోవటం,
యీ శిశిరంలోని చెట్టు ఎల్లప్పటికీ యిలాగే చిగర్చకండా ఎండి వుంటయ్యనుకోవటం,
యీ ఎండాకాలపు నిప్పులెండలు బండల్లా ఎల్లప్పటికీ యిలాగేకాస్తూ వుంటయ్యనుకోవటం,
చక్కగా నడుస్తున్న మనిషి తన హృదయం చప్పుడుచేయటం లేదను కోవటంలాటిది.
ఈ చీకటిడొంకల సరిచేయకండా మునుపటిలా పయనిస్తారనేది మిథ్య.
ఈ ఆకటి సంకెల తొలగించకండా మునుపటిలా వుంటారనేది పాత కాలపు విద్య.

—o—

"కళ, సత్యము–యివి రెండూకలసి బ్రతకలేకపోయినట్లయితే, కళను పోనీ సత్యమే బ్రతుకు, అబద్ధాలుచావు". —రోమాంరోలా.

"వాడుక భాషాశబ్దమునకు రసస్ఫూర్తికిచాలా దగ్గరసంబంధము. పూర్వ కవులందరు ఏశబ్దములు గ్రాంధికములు కావని గ్రాంధికవాదులు వాదింపనారంభించిరో ఆశబ్దములను వాడినవారే". —విశ్వనాధ

"కవుల నోటంట తప్పురాదు. కవి [illegible] అవసరంచొప్పున వ్యాకరణం తరవాత బయలు దేరి [illegible] ంటుంది"

# అతడు - ఆమె

## పుప్పల లక్ష్మణరావు

ఆమె - 9

అబ్బ! ఎండలు మండిపోతున్నాయి. కళ్ళెర్రగా ముందుకే వున్నాయి. ఇప్పుడే ఇలా వుంటే ఇక అప్పుడెలా వుంటుందో! నేలమీదగుడ్డ వుండుకోవడమే కష్టంగా వుంటే యీ ఖద్దరు వగైరా కట్టుకుంటే సంధ మంత్రంలాగు. దీనికితోడు వొంటికి బంక పూసుకున్నట్టు ఈ చెన్నపట్నం చెమట! ఇదంతా చాలనట్టు యీ ఆవకాయతంతు ఒకటి. అలహాబాదు వెళ్ళేముందు నాన్న నాతో:

"సుబ్బడూ! ఈ మాటు మేం ఇద్దరం ఇంట్లో లేకుండా అయింది. ఈ పూచీ అంతా నీమీద పడిందేవ్. మరి ఎలా పెట్టిస్తావోయేమిటో. ఆవకాయఅంటే సామాన్య విషయంకాదు. సంవత్సరం పొడుగునా వుండవలసిన సరుకు. సైన్యానికి మందుగుండు సామగ్రిలాగా ఆంధ్ర సంసారానికి ఆవకాయ అలాగు. సంసార సంగ్రామంలో జయాపజయాలు ఆవకాయమీదే ఆధారపడి వుంటాయనుకో. బహుపరాక్ సుమా!" అని మరీమరీ చెప్పివెళ్ళారు. చెప్పివెళ్ళడమేమిటి సభా కార్యక్రమం తయారు చేసినట్టు 'ప్రార్థన' దగ్గరనుంచి 'సభాధ్యక్షులకి వందనాలు' వరకూ కాగితం మీద ఇంగ్లీషున టైపుచేయించి మరీ ఇచ్చారు. రైలు కదులుతూండగా "సుబ్బారావ్! మర్చిపోగలవు రాయవేలూరు కోటగుమ్మందగ్గిర వైయాపురి మొదలియార్!" అని గొంతుక చించుకుని కేకేశారు. కార్యక్రమం ప్రకారం నిన్న ప్రొద్దున్నే లేచి స్టాండ్ జేకర్ కారులో వేలూరులో కోటగుమ్మందగ్గిర వైయాపురి మొదలియార్ మామిడితోటకి వెళ్ళి నాలుగువందలకాయ దింపించుకొచ్చాను. "చెట్టుమీదనుంచి కాయని దింపించుతూన్నప్పుడు ఒక్క కాయకూడా కిందపడనాటంకాదు. ఏమాత్రం దెబ్బతగిలినా కాయని తిరగొట్టేయ్! అటూఇటూ పరాగ్గా చూశావా దెబ్బతగిలిన కాయని నీకు అంటకట్టేస్తాడు. ఆవకాయ పులిసి పాడయి అఘోరిస్తుంది. నీ తెలివితేటలన్నీ ఉపయోగించవలసిన తరుణం! సుల్గోవా మొదటి రకం వందకాయ, పుల్లకాయ రెండోరకం మూడు వందలు దింపించు. కాస్త ఇటూ అటూ వున్నా ఫరవాలేదు. పోలీసువాడి దెబ్బలాగు కాయ కిందపడినా దెబ్బ వెంటనే కనిపించదు. జాగ్రత్త! రెండో రకం నౌఖర్లకీ నాగపుష్కరాళ్ళకీ అనుకోకుండా వచ్చే అభ్యాగతులకీ సరిపోతుంది. ధర్మానికిస్తే పిచ్చతనంచం అని దెబ్బలాట నట్టు గుద్దో యింకా సదేస్తున్నాం అని కృతజ్ఞత లేదు. అది బాగులేదు ఇది బాగు లేదుఅని సణుగుడే. కాలం మారిపోతుంది. ఇక యీ యుద్ధం తర్వాత సోషలిజం వచ్చిందంటే కాంగ్రెసు ధర్మమాఅంటూ ఇక అందరం గవర్నమెంటు ఫ్యాక్టరీలో తయారైన ఆవకాయనే కొనుక్కోవాలని ఆర్డరు వేస్తారేమో కూడా!" అని సోషలిజంమీద ఒక ఉపన్యాసం ఇచ్చారు టైపు కాగితం చేతికిస్తూను.

"ముక్కావకాయ వెల్లుల్లి వెయ్యనిది; డిటో బెల్లంవేసినది; తూర్పు ఆవకాయ కాయ కాయ క్కాయ వెల్లుల్లి వేసింది, డిటో వెల్లుల్లి వెయ్యనిది; తొక్కుడుపచ్చడి; మామిడికాయ మెంతి పచ్చడి; మాగాయ—వకటవ పరా: టెంకలు మాగాయిలో వేయటం ఎన్నటికీ మరచి పోకూడదు. రెండవ పరా: మాగాయలో వేపగింజ విరిగా వేసి తీరవలెను." అబ్బబ్బ! నాన్న కెందుకో ఇంత తిండి తాపత్రయం, రుచులకోసం చెవికోసుకోవడం? ఎంత వృథాప్రయాస? ఇదంతా మన క్షీణదశ చిహ్నాలుకావూ? నూటికి తొంభై తొమ్మండుగురు పస్తులుండి చస్తూంటే ఒక్కడు రుచులుమరిగి పంచపక్ష పరమాన్నాలు ఆరగించి బేఫుమని తేనుస్తే యేం నాగరికత? ఒకవైపు కోరివికారం, బండ పచ్చడి. ఒకవైపు టొమాటో రసం, బాదం ఖీరు! నాన్న పురమాయించిన రెండోరకం ఆవకాయ పదేళ్లకిందట మా నైజాంలో మాకు ఒక పూటకేనా దొరికివుంటే పంచ భక్ష్య పరమాన్నమే అనుకునేవాళ్ళమి. మామిడిటెంకలని చితక్కొట్టి లోపలజీడి బద్దలనితీసి అన్నంలో అద్దుకుని పచ్చిమిరప కాయ కొరుక్కు తినగలిగితే ఎంతో అదృష్టం అనుకునేవాణ్ని ఆ రోజుల్లో! అటువంటిది ఇప్పుడు నా కెన్ని కొత్తరుచులు అలవాటైపోయాయి! ఆవాలు, ఎర్రమిరప కాయలు, మెంతులు, వెల్లుల్లి, ఉప్పు, బెల్లం, సెనగలు - యేమిధరలు యేమి ధరలు! సామాన్య కుటుంబాలు యెలా సంసారాలు చేసుకుంటున్నారో కదా! అన్నట్టు నువ్వుల నూనె పులియంతోపు క్కరల కొట్టుదగ్గర పళణియాండి పడయాచి చేత గానుగపట్టించి మరీ కొనమన్నారు. మొదటిరకం ఆవకాయలో అంగప్ప నాయకన్ వీధిలో బంగాళీదుకాణంలో వక పీశె ఆవనూనెకొని వెయ్యమన్నారు. పైపు కాగితంలో ఆ దుకాణం చిరునామా సరిగ్గాచూడాలి.

మా యింటిలో ఆవకాయకోసం గుండలు కొట్టించడం కాయలని కడిగించి తుడిపించడం ఆల్చిప్పతో తొక్కతీయించడం శీఘ్రమంగలివాడిపని. నుడతకత్తి పీటతో కాయలని తరగడం డ్రైవరుపని. అటువంటిది ఇంటినుంచి బయలుదేరేముందు నన్ను అనుంటూ పిలిచి: "ఆవకాయ తరగడం పని వడివేలుకే వప్పచెప్పు. ఆ కమ్యూనిస్టు అమృతరావునిమాత్రం ఆవకాయ దగ్గరకి రానివ్వకు. వాళ్లు భాగ్యవంతులని చూసి ఓర్వలేరు. ఏముంది నువ్వు పరాకుగా వున్నప్పుడు ఆవకాయకుండలో ఒక పురిషెడు నీళ్ళుపోస్తేచాలు బూజుపట్టి పాడవడానికి. అసలు కమ్యూనిస్టుల కళ్ళు పడితే ఆవకాయ కుళ్ళిపోతుంది. జాగ్రత్త సుమా సుబ్బడూ!" అన్నారు. "అదేమిటి శాస్త్రీ! నీకు సంక్షపిచ్చి పడుతూన్నట్టుంది. ఆ మాటకివస్తే పదివేల రూపాయిల కారూ మన ప్రాణాలూ అతని చేతుల్లో పెడుతున్నాం కాదూ?" అంది అమ్మకోపంతో. "కారూ మన ప్రాణాలూ వాడి చేతుల్లో పెట్టాంఅంటే సివిలు బాధ్యత భీమాకంపెనీది. క్రిమినలు బాధ్యత డ్రైవరుదీని. ఆవకాయ విషయంలో వెట్టిచాకిరీ కాబట్టి సివిలు క్రిమినలు బాధ్యతలు వాడికేంలేవు. ఈ పద్ధతులన్నీ వాళ్ళకి కొట్టినపిండే. మీ అమ్మది సత్యకాలం. నువ్వు మాత్రం వాడికి ఆరోజు సెలవిచ్చేయి. దగ్గరకి రానిస్తే కనుకట్టుమంత్రం వేసేస్తాడు సుమా!" అన్నారు నాన్న. "అతను కమ్యూనిస్టు అని ఏం దాఖలా నాన్నా?" అని అడిగేమ నవ్వుతూ. "అదుగో మళ్ళీ

మొదటి కొస్తున్నావా? చదవేస్తే వున్న మతి పోతూంది నీకు. ఇకెందుకు? నువ్వు కూడా వాళ్ళలో వెళ్ళి చేరిపో!" అన్నారు నామీద విసుక్కుంటూ. శ్రీకృష్ణుడి విశ్వరూపసందర్శనంలాగు నాన్నకి యెక్కడ చూసినా కమ్యూనిస్టులే కనపడుతున్నారు. ఏ. ఐ. సి. సి. లోనూ వాళ్ళే. ఆవకాయ గూనల్లోనూ వాళ్ళే!

నాన్న ఎంతచెప్పినా సరిగా అందుకు వ్యతిరేకం అయింది. బ్యాంక్ కారుడ్రైవరు వడివేలు 'పెళ్ళానికి పురుడొచ్చి ప్రాణం మీదికొచ్చింది ఆస్పత్రికి తీసుకు వెళ్ళాను. నాలుగురోజులు సెలవకావాలంటూ ఆస్పత్రి నుంచి అగర్రాత్రి టెలిఫోను చేశాడు. శ్రీధ మంగలాడు వాళ్ళవూళ్ళో అమ్మవారు పండుగలనీ వద్దురా అంటూంటే మొండికేసి వెళ్ళిపోయాడు. ఇంకేం చేసేది? అమృతరావుని అడుగుతేనే కాని వీలులేక పోయింది. 'ఆజానుబాహు అరవింద దళాయ తాక్షం' అన్నట్టు అమృతరావు అందమైన మనిషి. తెల్లటి తెలుపు. ఆ తెలుపుకి మించినకాంతి కళ్ళల్లో. ఆకాంతికి మించిన మెరుపు. ఆ ధగధగమని ప్రకాశిస్తున్న తమ్ముడ్ని! అతన్ని పిలిచి అడిగేను ఇంగ్లీషులో.

"మిస్టర్ అమృతరావు! మీవల్ల రేపు నా కొక ఉపకారం జరగాల్సి వుంది. రేపు ఉదయం కారుమీద రాయవేలూరు వెళుతున్నాను, అక్కడ తోటలో ఆవకాయ కోసం మామిడికాయలు దింపించాలి. తరువాత ఇంటికొచ్చాక మడతకత్తిపీటతో కాయలు కోసిపెట్టాలి. ఈ పనులు మీ వల్ల కావాలి" అన్నాను.

"డ్రైవరు పనుల నన్నింటినీ విధిగా చేస్తాను. మిస్ సుభగారూ! మీరు పురమాయిస్తున్న మిగతాపనులకీ నా వృత్తికీ యేమీ సంబంధం లేదు. అటువంటి పనికీని నేను చెయ్యను" అన్నాడు.

"యజమానికి నౌకరుకూ అంతేనా సంబంధం?" అన్నాను నాకు కోపంవచ్చి.

"కోడెలుకీ మేకకీ ఉన్న సంబంధం. అంతే!" అన్నాడు కొంచెం బిగ్గరగా.

"మానాన్న అమ్మ మీకు యజమానులు. నేను కాను సుమండీ!" అన్నాను. అతని తమ్ముడ్రాంతికి చూపులని కిందకి వాల్చి "స్నేహితుల్లా అడగకూడదా?" అన్నాను మెల్లిగా.

"మీరు యజమానులు కాకపోయినా ఆ వర్గంలోచేరినవారే. గుర్రానికి గడ్డికీ స్నేహమేమిటి?" అన్నాడు. అతనిచేత యెలాగేనా పనిచేయించి తీరాలని మనసులో నిశ్చయించుకున్నాను.

"బతిమాలుకుంటే చెయ్యరా!" అన్నాను.

"తప్పు తప్పు! ఆత్మగౌరవం వున్న యేమనిషీ మరొకరిని బతిమాలుకోకూడదు. సరేలెండి. మీరు అంత ప్రాధేయ పడుతున్నారు కనుక నేను చేస్తాను. రేపు ఆరు గంటలకే వస్తాను" అన్నాడు కఠినంగా. ఇది మాత్రం నాన్నకి తెలియకూడదు. ముందు అమ్మతోచెబితే తరవాత నాన్నకి తెలిసినా అమ్మ సర్దుతుంది.

...ఆవకాయ పెట్టడాన్ని కారం గోళ్ళలోకి వెళ్ళిపోయి వేళ్ళు వకటే మంటలు. రెండు రోజులూ కలం పట్టుకోలేక పోయాను. ఈవేళ కొంచెం నయం. పత్రిక తీశాను చదువుదామని. పత్రికంతా ఊహాగానమే. ఊకదంపే. విసుగేసింది. చిన్న కునుకు పడుతూంది. "సుభద్రా! నీకోసం ఫోనే. ఎవరో అడుగుతున్నారా? నాన్న అడగమన్నారుగా!" అంది. "నాన్న చెప్పిన పాఠం నాన్నకి అప్పచెప్పాలి! నాన్న

ఇక్కడలేరుగా! నేను వస్తున్నానులే" అని ఫోను అందుకున్నా...

టెలిఫోను చేసింది సీతారాం. ఈమధ్య నాలుగైదు నెలలై ఇతను ఐపుజాడాలేదు. అంచేత గొంతుక చప్పున ఆనవాలు పట్ట లేకపోయాను. నెలరోజులై చెన్నపట్నంలో వుంటున్నాడుట. మీ యింట్లో వుంటే సాయంకాలం ఐదుగంటలకి వస్తానులెండీ అన్నాడు. మేం ఇంగ్లండులో వున్నప్పుడు ఇతను అక్కడ ఇంజినీరింగు చదువుకొనేవాడు. తరుచు కలుసుకొనే వాళ్ళం, ఆ రోజుల్లోనే కారువేషమున్నా. ఎర్రగా బుర్రగా వుంటాడు. చలాకీ మనిషి! నాకు మొదట డాన్సింగుఇతనే నేర్పాడు. చెన్నపట్నంలో రెండు మూడుసార్లు కనిపించాడు. వాళ్ళకి కొత్తవలసడాబాలు దగ్గర, రెండు మూడు గ్రామాలున్నాయిట. రైతులతో తగాయిదాలుంటే నాన్నదగ్గర, సలహా కోసం అని వచ్చాడు. తరువాత మళ్ళీ కనిపించలేదు. నాన్నదగ్గర కొచ్చినప్పుడల్లా రాత్రి అందరినీ సినిమాకు తీసుకువెళ్ళి కన్నెమేరాలో విందు. ఎందుచేతో మరి మొదటినుంచీ సీతారాం అంటే అమ్మకి అంత నచ్చేది కాదు. ఒకనాడు యేదో సందర్భంలో నాన్న సీతారాంగురించి వూరికే పొగుడుతూవుంటే అమ్మంది "సీతారాం మంచివాడే, కాని డబ్బు గడుసుతనం రెండూ వున్నవాళ్ళంటే నాకు ఎంచేతో భయమే సుభా!" అందినాతో. నాన్న ఆమాట అందుకుని: "ప్రపంచంలో ఐశ్వర్యం తెలివితేటలూ వున్నవాడిని గొప్పవాడిని చూసినా నీకు భయమే. కుర్రవాని బుర్రలోకి అక్కరకు రాని పాతకాలపు చాదస్తాలన్నీ ఎక్కించి పాడు చెయ్యకు. సీతారాంకి రెండుకార్లున్నాయి. తండ్రికి ఒక్కడే కొడుకు. ప్రాప్రయిటరీ గ్రామాలు రెండున్నాయి. అంతా తండ్రి స్వార్జితం. బర్మాలో ఐదారు లక్షలు సంపాదించి జపానువాడొచ్చేలోగా వ్యాపారాన్ని అమ్మేసినగదుమూటకట్టుకునిదేశానికి వచ్చేశాడు. బర్మానుంచి పారిపోయి వచ్చేసిన వాళ్ళకోసం లక్షరూపాయలిచ్చి గౌహాతీలో ధర్మసత్రం దేముడిగుడి కట్టిస్తున్నాడు. దానం ధర్మం దాంతోపాటు కాస్తోకూస్తో వ్యాపారం చేసుకుంటూ అస్సాంలోనే వుండిపోయాడు. ఇదే సమయంలో జపానువాడొచ్చేలోపుగా చవగ్గా రెండు మూడు తేయాకుతోటలు కొనిపారేయమని సలహాయిచ్చాను. నా కళ్యాణం సంగతి నాకు బాగా తెలుసుగా. సీతారాం దేహీఅని వకడిదగ్గరకి వెళ్ళక్కరలేదు. ఒకడి కింద ఉద్యోగం చెయ్యక్కరలేదు, ఇక కావలసిన దేముంది? ఎటొచ్చీ బ్రాహ్మడు కాడని. ఏమిటో ఈ రోజుల్లో మనలాంటి వాళ్ళకూడా అలాంటి చాదస్తాలు పెట్టుకుంటే జరుగుతుందా? అందులోకి మనం కాంగ్రెసువాళ్ళము. దేశసేవకి మనం కంకణంకట్టుకున్నాం కూడాను. సుబ్బడూ! నే నొక్కటి చెబుతున్నాను విను. నువ్వే యెవడిని చేసుకున్నా నా కిష్టమే. డబ్బు రెండు కార్లూ ఇళ్ళూ వాకిళ్ళూ వున్నవాడిని చేసుకుంటే నువ్వు సుఖపడుతావు. వాడిని సుఖపెడతావు. బ్రాహ్మడు అయితే ఉత్తమం. బ్రాహ్మడుకాకపోయినా హిందువుడయితేమధ్యమం. ఇకయేదీ లేకుంటా ముసూదేకులాడో సోషలిస్టో అయితే నీ ఇష్టం మీ అమ్మ ఇష్టం నా ఇష్టం చెల్లుతుంది కనకనా?" అన్నారు నాన్న.

"నాన్నా! మరి పెద్దనాన్నగారు దొరసాన్ని చేసుకున్నారు?" అన్నా.

"పెద్దనాన్నగారు మొగాడు. అయినా ఆడదిడ్డం అంటే పెడదిడ్డం నాకు బాగా

అలవాటైంది. మొన్న వొడిగానికి తెలీకుండా కుర్రాడితోనూ కుర్రదానితోనూ వురేసుకున్నాడో తెలుసునా ? ధోరణి కాని ధోరణన్నీ కాని చేసుకుంటే దమ్మిడీ లేకుండా డబ్బంతా తిరుపతి వెంకటేశ్వరుల దేవస్థానానికి వీలురాసి ఇచ్చేస్తానన్నాడు యేమనుకున్నావో ! డబ్బు దస్కం వున్న వాడిని చూసుకుని నీ ఇష్టంవొచ్చిన వాడిని చేసుకో. ఎవ్వడితో నేనామాట ఇచ్చే ముందు ఆ మొగాడి జాతకం మాత్రం నా మొహాన్న పారేయి. చంద్రబలం తారాబలంచూసి అనుకూలమైన సంబంధమో కాదో నేను చెబుతాను."

"ఏంచంద్రబలం యేంతారాబలం? మాలతి ఖర్మమేమైందో చూశారా?" అన్నాను.

"బాగుందే మరి ! ప్రపంచంలో పుట్టుకలు లేకుండా చావులు లేకుండా వుంటుందనే. ఇంతకీ అన్నీ చూసుకోబట్టే పార్వతీశంగారి వోళ్ళో చల్లకదలకుండా పదిలక్షలొచ్చిపడ్డాయి ! దానికేం చెబుతావు?" అన్నారు ఒక సవాలు పారేసి.

...సీతారాం వచ్చారు. "సుభగారూ! మీరీ మధ్య వూళ్ళో లేరాయేమిటి?" అని అడిగేడు. "అవునండీ స్నేహితురాలని చూడాలని విశాఖపట్నంవెళితే ఆ బాంబింగులో చిక్కుపడి వుండిపోయాను"అన్నా. "అంతా వుత్త హంగామాలేగాని జననష్టం ఆస్తినష్టం యేం కలగలేదుటగా? అయినా జపానువాడికి మనంఅంటే కిట్టదాయేమిటి? అన్నాడు. "అదేమిటి అలాఅంటారు ? బర్మాలో మనవాళ్ళని యమయాతనలను పెడుతున్నాడటగా ?" అన్నాను ఆశ్చర్యంతో. "మనవాళ్ళకి బర్మాలో మరిస్థానబలిమిలేకపోతే జపానువాడేం చేస్తాడు? 'నీళ్ళలోన మొసలి యేనుగుబట్టు, బైట కుక్కచేత భంగపడును' అన్నాడు వేమన. మనవాళ్ళుబర్మావాళ్ళతో సఖ్యంగావుంటే యే గొడవా లేకపోను. సింగపూరులో చూడండి. మనవాళ్ళని నెత్తిమీద పెట్టుకుని పూజిస్తున్నారు" అన్నాడు వేమన పద్యం చదువుతూ.

"సీతారాంగారూ! చెన్నపట్నంలో ఏం చేస్తున్నారండీ? ఆ మధ్య కనిపించినప్పుడు కలకత్తాలో వుంటున్నానన్నారే?" అని కుశలప్రశ్న వేశాను.

"అవునండీ. 'ఫాదర్' అన్నాంలో తను చేస్తూన్న ధర్మకార్యాలకి ధర్మకర్తగా వుండిపోమంటాడు. నేను ఎంత గుండె నిబ్బరం చేసుకున్నా ఆ బర్మా కాంగిశీకుల యేడుపులూ మొర్రలూ చూస్తే నాకు తిన్నతిండి వంటబట్టేది కాదంటే నమ్మండి. అందులోకీ ఆడపిల్లలూ స్త్రీలు పట్టపగలు పడుతూండే అవమానాలనీ అగచాట్లని చూస్తే యీ రెండుకళ్ళూ పొడిచేసుకుందామా అనిపించింది. అందుచేత 'ఫాదరు' వుండమని శతపోరుపెట్టినా కాందిశీకునిలాగు నేనే పారిపోయి వచ్చేశాను. ఆ దేముడి గుడిన్నీ పక్కగవున్న అనాథశరణాలయం కట్టించేసి. ఇంకేసినికి నా మరియేంతేనా. ఆ దృశ్యాలన్నీ మర్చిపోవడానికనీ పేరంబనగా వుంటుందనీ ఉద్యోగం పురుషలక్షణం అని ఇక్కడ ఒక ఇంజనీరింగు కంపెనీలో చేరాను పదిహేను రోజులైంది. అరంబాకంలో అమెరికన్ల కోసం నేవల్ డిపో వకటి కడుతున్నారు. పనిసరదాగా వుందిలెండి. పనిచేస్తే అమెరికన్లతో కలిసి పనిచెయ్యాలండీ.ఎందుకంటే మన చదువులన్నీ 'కదసితామగందు కప్పకూర్చు న్నట్లు' అని వేమన అన్నట్టు. మన ఇంజినీర్లూ చదువుకున్నారు చదువులు." అన్నాడు.

"సీతారాంగారూ! మీరు మహా చమత్కారంగా మాట్లాడుతారండీ. ఆరంగ్రాకం కబుర్లు చెప్పండి" అన్నాను. "ఏం చెప్పమన్నారు? అక్కడ చిత్రమైన మనిషి వకాయన వున్నాడు" అన్నాడు. "ఎవరండోయ్?" అన్నాను. "నక్కపుట్టి నాలుగు వారాలు కాలేదు ఇంతగాలివాననెప్పుడూ చూడలేదందిట. అలాగా అతను చిన్నప్పుడు వదిలి వెళ్ళలేదు జన్మలో. అన్నీ తనికి తెలుసునంటాడు. సహాయాతన పెట్టేస్తున్నాడండీ మమ్మల్ని!" అన్నాడు విసుక్కుంటూ. 'ఏం? లంచాలు తెమ్మంటాడా?' అన్నాను చకితుణ్ణై. 'తెమ్మన్నా బాగుండును అండీ 'పెట్టి పొయ్యలేని నరులు భూమి, పుట్టనేమి వారు గిట్టనేమి, పుట్టలోన చెదలు పుట్టవా గిట్టవా?' అన్నాడు ఆ మహానుభావుడు. 'ముక్కుసూటిగా పోతాను. తల వెంట్రుకవాసి తప్పవాటం కాదంటాడు' అన్నాడు లోపల మండిపోతూ పైకి నవ్వుతూ. 'ఎవడండీ అతను?' అని అడిగేను. 'పేరు చెబితే మాత్రం మీకేం తెలుస్తుందిలెండి? అయినా అతన్ని అని యేం ప్రయోజనం లెండి? జన్మ అలాంటిది. పులుంబాతనం ఉదారస్వభావం పుట్టుకతో రావాలి. తల్లి నీళ్ళబిందెలు మోసి చదువు చెప్పించిందట. భాకీతనం దర్జా రమ్మనమంటే యెక్కడనుంచివస్తాయి ఉద్యోగం అంటే వచ్చిందిగాని? తనసొమ్ము అయినట్టు దమ్మిడీ దగ్గరనుంచీ లెక్కపెడతాడండి గవర్నమెంటు డబ్బు. వుత్త దరిద్రుడు కోరికాడండీ మానవు. 'ఎవ్వరిగుణములు యేమున్న మానవు, చక్కజేయరాదు కుక్కతోక' అన్నాడు మా గురువు.

'మీరూ, ఇంజనీర్లేకదా? డిజైను మార్చండి అని నచ్చజెబితే వినడా?' అన్నాను.

'ఇన్ని దేశాలు తిరిగొచ్చారుగాని మీకు ప్రపంచం తెలియదండీ సుభగారూ! వేమన అన్నాడు: 'లోభివాని జంప లోకంబు లోపల మందువలదు వేరె మతముగలదు. పైక మడుగగ భగ్గునపడి చచ్చు' అన్నట్టు ఆమాట యెత్తితే చాలు పంచప్రాణాలు పైకెగిరి పోతాయి ఆయనికి. దేశ దేశలూ తగలడిపోతూంటే అక్కడికి డిజైనంటే శిలాక్షరం లాగు. అవతల జపానువాడు అజాతశత్రువులాగు మీదపడిపోతున్నాడు. ఇవతల 'ఇంటిలోని పోరు ఇంతింతగాదయా' అని అమెరికావాడు వేధించేస్తున్నాడు, మధ్యన మేము నలిగిపోతున్నాం అంటే నమ్మండి' అన్నాడు సీతారాం. 'ఇంతకీ ఆయన పేరు చెప్పారు కారు' అన్నాను. 'ఆయన నామధేయం జనార్ధనరావుగారు. మీకు తెలియదులెండి ఆయన్ని' అన్నాడు 'పేరెక్కడో విన్నట్టుందండీ' అన్నాను నాకు తెలియనట్టు నటిస్తూ. 'మీరు వింటే వినుండవచ్చు. నలుగురిలో తిరిగే మనిషి కాడు. అసలు మనజట్టు వాడు కాడులెండి. తల్లి వాళ్ళింట్లోనూ పిల్లింట్లోను నీళ్ళబిందెలు మొయ్యడం వంటలక్క పనిచెయ్యడం ఇతను ఇంటింటా అంగాంగా వారాలు చేసుకొని చదువుకోవడం అతడు నలుగురిలోనూ చిన్నతనం పడతాడు మరి. కడుపునపుట్టిన 'మదర్' గురించ అలా తలవంపులు పడ్డవుండే మనిషిలోచేవలేదన్నమాట' అన్నాడు గట్టిగా. 'అతని పుట్టుపూర్వోత్తరాలన్నీ బాగా చూపి తీశారే' అన్నాను నవ్వుతూను.

'నాకు అతనితో ఈ పదిహేను రోజులైయే పరిచయం. కాని మా కంపెనీ డైరెక్టరు సేక్రెటరీ యీ సంగతులన్నీ చెప్పాడు. సేక్రెటరీ మహా ఘట్టిబుర్రలెండి. గొప్ప

హోదాలో వున్న ఉద్యోగులందరిగురించీ అతను ప్రత్యేకంగా మనుష్యుల్ని పెట్టి భోగట్టా అంతా సంపాదించి నాడీ గ్రంథం లాంటివి తయారుచేస్తుంటాడు' అన్నాడు. సేట్జీని మెచ్చుకుంటూ. 'సి. ఐ. డి. రిపోర్టు అందుకూ' అన్నాను. 'పెద్దమాటే విసిరారు. ఎవరికోలకం ఎక్కడుంటుందో ఎవరిని గోకరవేసి యే గేలంతో లాగాలో మరి తెలుసుకోకపోతే వ్యాపారం ఎలా చేస్తామండీ అంటాడు సేట్జీ' అన్నాడు.

'తనకింద ఉద్యోగం చేస్తున్న వాళ్ళగురించికూడా భోగట్టా సంపాదిస్తాడా?' అని అడిగేను.

'తన వాళ్ళగురించి చేస్తే తనకేం ఉపయోగం? ఏమోలెండి? మా 'ఫాదర్' అంటే నేను బుర్ర వొంచుకోవలసిన అగత్యం లేదుకదా. నేను ఇంగ్లండులో వున్న ఆరు సంవత్సరాల్లోనూ నలభైవేలు పంపించాడు, ఇప్పటికీ అలాగే సుమండీ' అన్నాడు.

'మీ తండ్రిగారిది యేం వ్యాపారం సీతారాంగారూ? మీ సేట్జీలా నేనూ భోగట్టా తీయడం మొదలు పెడుతున్నాను సుమండీ' అన్నా నవ్వుతూ. 'నా చిన్నతనంలోనే మా 'ఫాదర్' బర్మా వెళ్ళిపోయాడు ఆ తరవాత నేను వెళ్ళిపోయాను. అందుచేత నాకు బాగా తెలియదు కాని సరుకులు యెగుమతి అనుకుంటాను. ఇప్పుడేం వ్యాపారంలెండి? కృష్ణా రామా అనుకుంటూ అక్కడ దానం ధర్మం చేసుకుంటూ కూచున్నాడు. మరి నేను వెళ్ళొద్దునా శుభగారూ? మళ్ళీ యెప్పుడు కలుసుకోవడం? నా టెలిఫోను నెంబరు ఇదుగో' అంటూ వెళ్ళిపోయాడు.

ఇప్పుడు తెలిసింది జనార్దనరావు మా యింటికి రమ్మనమని నేను యెన్నిసార్లు పిలిచినా ఎందుకు రావడంలేదో అని. పాపం వాళ్ళమ్మ ఎంత కష్టపడి చదువు చెప్పించిందో కదా? అంచేత అతను చిన్నతనం పడుతూ నలుగురిలోనూ తిరగడానికి జంకుతున్నాడని నే ననుకోను. అమ్మ నాన్న వొచ్చాక మళ్ళీ మరోసారి పిలిచి రమ్మనమని బలవంతం చెయ్యాలి. ఈ రోజుల్లో డబ్బుకి కక్కుర్తిపడకుండా మనుష్యుని మనిషిగా చూడడం గొప్పమాట. అలాంటి వాళ్ళని వేళ్ళమీద లెక్క పెట్టొచ్చు.

అయితే సీతారాం జనార్దనరావుగురించి నా దగిర యీ మాట అందుకు జారేడు? అబ్బే ఎందుకేమిటీగాని భలేవాడులే సీతారాం. వేమనవంటే చెవి కోసుకుంటాడు. 'ఫాదర్' 'ఫాదర్' అంటాడు, నాన్న అనకూడదూ. ఇంగ్లీషు ముక్కలు వాడలవాటు కాకపోతే సరేమిటి? నెమ్మదంమీద గమ్మత్తుమనిషి. అప్పటికీ ఇప్పటికీ చెక్కుచెదరలేదు ఆ నిగ్రహం ఆ హాస్యమున్నూ... జనార్దనరావుకి టెలిఫోను చేదునా? రాత్రి సినిమాకి వెళ్దాం అని? ఈవాళ వద్దు. రేపుచేస్తా.

అతడు - 10

"ఈ కొత్త కాలువమార్గం ప్రారంభించడం కాదు కాని నెల్లాళ్ళ వ్రాసిరి కలపకుండా వుండి పని. అలా చేతినిండా పని వుంటేనే నాకు సరదా. కాని ఇక్ష్వాకుల నాటి యీ వంతెనల కల్పించుకుంటే నాకు తలనొప్పి వస్తూంది. ఇదే ప్రీస్ట్రెస్డ్ కాంక్రీటులో కడితే ఎంత బాగుండును. ఈ మాటు కాస్త తీరుబడి వున్నతరువాత డ్రాయింగులు గీసి లెక్కలు కట్టిచూడాలి. అప్పటికి కాని నాకు తనివి ... 'ప్రీస్ట్రెస్డ్' అయితే ఈ కంట్రాక ... న్నంత అజ మాయిషీ ... కని

నేను స్వయంగా చూడబట్టికాని లేకపోతే ఏమైవుండునో. వంతెన పునాదులకి నేను అంగుళం ఖడ్డీలని వెయ్యాలని చెపితిని. సరే అన్నారు వాళ్ళు. తీరా చూదును ఆరు సూళ్ళవి వేసి పని మొదలు పెట్టేస్తున్నారు. వాళ్ళ పెద్దఇంజనీరుని పిలిపించి చూపించితే తనకింది వాళ్ళని నా ఎదుటే ఛడామడా తిట్టి క్షమాపణ వేడుకుని చేసినపనినంతా పగగొట్టించి మళ్ళా చేయించాడు. పాపం ఇతనెవరో చాలా మంచివాడులాగున్నాడు. తెలుగువాడే. సీతారాం అతనిపేరు. నేను నా కింది ఇంజనీర్లతో 'మీరందరూ ఎలా చూస్తూ వూరుకున్నారయ్యా?' అని నేను కొంచెం కోపంగా అడిగేసరికి సీతారామే కలుగజేసుకుని 'మీ వాళ్ళదేం తప్పులేదండీ. తప్పంతా మా వాళ్ళదేనండీ. అందుకు నాదే జవాబుదారీ' అంటూ సర్దేశాడు. సాంకేతికవిద్యలో ఆరితేరినవాడూ ఉత్సాహవంతుడూ చాలాగే యువకుడూ. అంచేత అతనంటే నాకు సరదా వేస్తోంది. అతన్ని పరిచయంచేసుకుందాం అని రెండు మూడుసార్లు అనుకున్నానుగాని యీసంగతి గులాబిచందు సేటుకి తెలుస్తే నన్ను మళ్ళీ ముట్టడించడం మొదలెడతాడు. ఎందుకొచ్చిన చికాకు అని మానేశాను.

సుభ నాలుగు రోజులకిందట టెలిఫోను చేసింది. 'ఏమండీ జనార్దనరావుగారూ! బొత్తిగా మొహం చూపించడం మానేశారు? మమ్మల్ని నందరినీ వెలివేశారా యేమిటి? నేను విశాఖపట్నం వెళ్ళొచ్చాక వక్కసారి కాంపు కలుసుకున్నాం బీచి దగ్గర. పుష్కరంనాటిమాట. మళ్ళీ పుష్కరానికేనా యేమిటిమిమ్మల్ని చూడడం?' అంది ఆమె. ఆవి[illegible]ంపు మాటలని వింటూంటే [illegible]వుంది. ఏమి గా[illegible]రం. ఆ గొంతుకలో ఎంతో ఆప్యాయం లాలన అంతర్లీనం అయి ప్రశాంతంగా ప్రవహిస్తూన్నట్టుంటుంది. సినీమాకి వెళ్ళినప్పుడు చూస్తూంటానుకదూ. కొంతమంది ఆడవాళ్ళు సముద్రపు హోరులాగే హడావుడి గడబిడ. కొంతమంది వడగళ్ళవాన [illegible]. రాయవేసినా బుడంగుమని చప్పుడుకాని అలలుకాని లేకుండా చలనంలేని చెరువుల్లాంటి వాళ్ళు కొంతమంది. [illegible] సంభ[illegible]లాలు కూలిపోయాయి పారే గోదావరి పారడం మానేసింది సభవారికి చాప అంటుకుపోయిందని అమ్మ కథ చెప్తూండేది. అలాగా నెల్లాళ్ళయి నా కుర్చీకి నేను అతుక్కుపడిపోయాను. ఈ ఆదివారం ఎలాగేనా గుండె ధైర్యం చేసుకుని వాళ్ళఇంటికి వెళ్ళి ఆమెనుచూసి ఆమె తల్లిదండ్రుల పరిచయం చేసుకోవాలి. లేకపోతే ఆమె ఏమేనా అనుకుంటే నేను బతకడంయెలా? ఆమెకి నామీద కోపంవస్తే నేను భరించగలనా? నాకెవరున్నారు ఈ ప్రపంచం మీద? 'ఏం జనార్దనం, నిన్ను చూసి చాలా రోజులైందోయ్' అన్నవాళ్ళెవరున్నారు?

...సాయంకాలం నేను నా సెలూను బండికి ముందుగా వచ్చేశాను. స్నానంచేసి ఫలహారం చేస్తూండగా సీతారాం వచ్చాడు. ఎంతేనా తెలుగువాడు. తోడి ఇంజనీరు. మొహంమీద తలుపు వేసేయలేనుకద. 'దయచెయ్యండి' అన్న. 'మావాళ్లు తప్పుకి మీ ఎదుట బుర్రెత్తుకుని తిరగలేకుండా వున్నానంటేనమ్మండి జనార్దనరావుగారూ. నేను వాళ్ళపైన చీఫ్ ఇంజనీరునైనా 'ఓటికుండ నీరుపోసిన చందాన విశ్వదాభిరామ వినురవేమ' అని వేమనలాగు నేను ఎన్ని చెప్పినా వినిపించుకోరుగదా. ఉద్యోగం మానుకుందాం అని వుంది' అని అన్నాడు అతను విచారంగా.

# నాదత్రయము

మాదిరాజు రంగారావు.

### మొదటి కంఠం

చెక్కిన చీకటి బొమ్మలాగల్లా
కూర్చున్నావేం ? తమ్ముడూ! మానవ
జీవిత మహత్తు వినలేదూ! కన్నులెత్తి
చూడు ! ఎంత రసైకమయం జీవితం
వికసించిన మందార సుమహాసాలలు
నల్లని మొగిళ్ళల పరస్పరామంత్ర
గానంశోభనా మధుర దృశ్యా
సుచిస్మేరఫీన సుషమాదృశ్యాలు
కళాకాంతి నికేతన మీ ప్రపంచం
సుందర శిల్పాగార మీ సమాజం
ప్రతి మనిషీ వొక మేధాశిల్పి
పరిమిత జీవిత మొక శిలాభిత్తి
ఎంత ఆనందమయ మీ జీవితం
ఈ స్వర్గానంద ధ్వని తరంగాలు
ప్రతి మనిషి మేధకూ తట్టవేం ?
సంతోషపు రెక్కలతో యెగురడేం ?

### రెండవ కంఠం

కనులు వంచి చూడు, నేటివరకు
కాంతి కిరణ లవ మెరుగని, చీకటి
గుండెలతో, నఖశిఖపర్యంతం
తెల్లని వర్ణపు టుడుపులు ధరించి
ఎత్తు పల్లమే తెలియని చీకటిలో
విద్యుద్యుగ మహో దశలోనూ, తమ

ఉనికి స్థిరత్వానికి ప్రాకులాడు
గుడ్డి వెలుగు దీప స్తంభాలు

దీప స్తంభాల క్రింద నసించే
స్వీయ రూప రేఖలే యెరుగని
సామాన్యపు జాతుల దుర్బల
జీవిత మెంత నరక ప్రాయం! భాయి!

## మూడవ కంఠం

ఎన్ని సూర్యబింబాలు మాడిపోలా!
ఎన్ని చంద్రబింబాలు వాడిపోలా!
ఎంత మంది శాంతి మార్గాల ధర్మ
బోధలు జలధి ఘోషను మించిపోలా?

దినమణి కాంతి యెరుగని వేళలందు
ఎన్ని చిన్ని దీపాలు వెల్గించుక మురిసిపోలా!
ఎన్నిమార్లు నిశాతారుణ
కాంతి ఖడ్గం ప్రయోగించలా!

ఈ చీకటి వృక్షం శాఖోపశాఖలుగా
గగనమెత్తు నిలిచిపోతుందేం?
ఈ వృక్షపు కీనీడల ఎడారులలో
నివసించే, మనిషి మేధా శిఖరి

జ్ఞాన రసాపగ పరుగిడుతుంటే
నిస్తబ్ధత వ్యాపించిన ఆశాపీథుల
వొక్కమారు, చైతన్య కాంతి ఝంఝగా
సంగీత ధ్వని వినిపిస్తుంటే;

మేల్కొని, గత చరిత్ర తలచని,
కాంతి కిరణ కిసలయాంగుళితో
తన నిజస్వరూపావిష్కరణ
వాంఛించని మానవు డెవ్వడు?

# వసుంధర

ఏచ్చేశ్వరరావు

## ఒక కాలేజ్

వసుంధర నాలోనే, నన్నుగూడా కలిపి చదువుకుంది; నా గదుల ముందున్న ఆటలస్థలాల్లో ఆడుకుంది. ఆవిడ లెక్చరర్లు నడిగే ప్రశ్నలు వింటూంటే నా గదుల గోడలికి సున్నం వేసినట్లుండేది. ఆవిడ రింగ్ టెన్నిస్ ఆడే వడుపుచూస్తూంటే, ఆవిడ కాళ్లు కందకుండా, నా వళ్లు మండకుండా ఆటస్థలాల్లో పచ్చని పచ్చిక మొలచినట్లుండేది.

## ఒక రోడ్డు

వసుంధర రోజూ నన్ను నడచే కాలేజీకి వెళ్తూండేది. వసుంధర నడుస్తూంటే, చూస్తూ, మైమరచి నే నలాగే నిలబడి పోయేదాన్ని; వసుంధర చకచకా కాలేజ్ కో, లేకపోతే తిరిగి యింటికో, సాగిపోయేది. నే నెక్కడ బాధపడతా ననుకునేదో యేమోగాని, యెప్పుడూ వారవారనే నడుస్తూ వెళ్లేది. అటూయిటూ అడుగులు వేస్తే అదరి పోతా ననుకునేదో యేమో, సన్నని తిన్నని గీతగీసికొని, ఆ గీతమీదనే అడుగులు వేసుకుంటూ వెళ్తున్నట్లు వెళ్ళేది. పుస్తకాల్ని పొత్తి యెడంచేత్తో రొమ్ము కాన్చుకుని, యెడం భుజంమీది పమిటకొంగు కుడిచంక క్రిందినుంచి ముందుకులాగి పట్టుకుని గబగబా నేలను చూసుకుంటూ నడచివెళ్లేది.

## కాలం

నేను గడుస్తాను. పరిస్థితులు మారతాయి. వ్యక్తుల్లో పరివర్తనం వస్తుంది.

## వ్యక్తులు

మేం మారుతూ, పరిస్థితుల్ని మారుస్తాం. కాలానికి కళ్ళెంవేసి, స్వారీ చేస్తాం.

## పరిస్థితులు

మేం మారతాం. వ్యక్తుల్లో మార్పు వస్తుంది. కాలాన్ని గడుస్తాం.

## 1942 ఆగస్టు

నా రోజుల్లో దేశం అట్టుడికి నట్టుడికింది. రైళ్లు పట్టాలు తప్పినై. గడియారాలు నిలబడి పోయినై. కాలానికి విలువ పోయింది. కాలేజీల్లో సమ్మెలు జరిగాయి.

## కాలేజ్ గేట్

ఇదిగో యిక్కడే, నా యినుపతలుపు కానుకుని నిలబడింది వసుంధర, వీరికీ సహాధ్యాయుల్ని కాలేజీలోకి వెళ్లకుండా ఆపింది. కారుమీదవచ్చి, లోపలికి తుర్రుమనాలని చూచిన రావుబహదూర్ గారమ్మాయికి దారి నివ్వకుండా నేలమీద పండుకున్నది.

## పోలీసు చెయ్యి

నే నావిణ్ణి పట్టుకుని బరబరా లాగాను.

పోలీసులాఠీ

నే నావిడ శరీరాన్ని దబదబా మోదాను; బాదాను.

జట్కాబండి

వసుంధర నన్నెక్కింది. రైలు స్టేషన్ దగ్గర పడి పోయిన విద్యార్థుల దగ్గరకు తోలుకెళ్లింది. ఒక్క గంటలో క్రిందికి దుమికింది.

'42 బాధితుడు

ఆవిడ నా గాయాలు కడిగి కట్లు కట్టింది. కాఫీ యిచ్చి, నుదుటిమీద చేయి వేసింది. అంతే : లాఠీల దెబ్బలూ మరచిపోయాను; గాయాలసలుపూ మరచి పోయాను.

డాక్టరు

నిజమే. ఆ పది, పదిహేను రోజులూ ఆవిడ నిద్రాహారాల్లేకుండా పనిచేసింది మా హాస్పిటల్లో. పోలీసుల ఆయుధాలు బాధపెట్టిన వాళ్లనందరినీ ఆత్మీయులుగా చూసుకొంది. అనుభవం వున్న నర్సులు కూడా అట్లాగే చూస్తూ నిలబడి పోయేవారు ఆవిడ ఏకాగ్రతనూ, ఓరిమినీ, కరుణనూ చూచి. తనకు తగిలిన దెబ్బలసంగతే మరచిపోయింది.

కాలం

నేను గడుస్తాను. పరిస్థితులు మారతాయి. వ్యక్తుల్లో పరివర్తన వస్తుంది.

వ్యక్తులు

మేం మారుతూ పరిస్థితుల్ని మారుస్తాం. కాలానికి కళ్లెంవేసి స్వారీ చేస్తాం.

పరిస్థితులు

మేం మారతాం. వ్యక్తుల్లో మార్పువస్తుంది. కాలాన్ని గడుస్తాం.

వసుంధర తండ్రి

వసుంధర నా కూతురు; ఒక్కగా నొక్క కూతురు. తల్లిలేని పిల్ల. చిన్నప్పట్నుంచీ నా చేతుల్లో సాకాను. పెంచాను. చదువు చెప్పించాను. పెద్దదాన్ని చేశాను. ఊళ్లో వాళ్లందరూ నన్నెగతాళి చేశారు. ఆడపిల్లలకింత పెద్ద పెద్ద చదువు లెందుకన్నారు. చదువుకు చదువునూ ఖర్చుపెట్టి, కట్నాలకు కట్నాలయిస్తే యింక బ్రదకక్కర్లేదా అన్నారు. కొంప గుండం పడిపోదూ అన్నారు.

ఒకస్నేహితురాలు

అది కాదు; నిన్న మొన్నటిదాకా జాతీయత అనీ, స్వరాజ్యం అనీ, ప్రజలనీ అంటూ తిరిగిన వసుంధర ఆ పోలీసు అధికారి నెట్లా పెళ్లి చేసుకుంటుందో అర్థంకావటం లేదు.

మరోస్నేహితురాలు

. ఇందులో అర్థం కావలసిం దేముంది? వసుంధర యెప్పుడూ సిద్ధాంతాల మనిషే. స్వామిభక్తి, వుద్యోగ కర్తవ్య నిర్వహణమూ అంటే యెప్పుడూ ఆదరిస్తూనే వుండేది. వీటి రెంటికీ ఆ అధికారి పేరు పడ్డవాడే నంట.

### ఇంకో స్నేహితురాలు

అంతే కావచ్చు. ఐనా ఖద్దరుకీ ఖాకీకీ ఎట్లా పొత్తు కుదురుతుంది ?

### ఒక స్నేహితుడు

ఖద్దరు కుర్చీలో కూర్చుంటే, ఖాకీ గూడ ఖద్దరుచెప్పినమాటే వింటుంది. ఇదివరకు ఉద్యోగస్తులు ఉద్యోగ కర్తవ్యాన్నీ, దేశభక్తినీ ఎన్నుకోవలసి వుండేది. ఇక ముందా చిక్కు వుండదు! దేశ స్వాతంత్ర్యానికీ, ఉద్యోగ కర్తవ్యానికీ పోటీరాదు. అందుచేతనే వసుంధర ఉద్యోగిని వివాహం చేసుకుంటోంది.

### 1948 ఆగస్టు

వసుంధర వివాహాన్ని చూచే భాగ్యం నాకు కలిగింది. దేశ స్వాతంత్ర్య సముపార్జనాందోళనా, దేశరక్షణ శక్తీ యేకమైనాయి. అయితే ఒక్క సందేహం మాత్రం తీరలేదు నాకు: వసుంధరను సింహాచలానికిచ్చి పెండ్లిచేశారా? వసుంధర సింహాచలాన్ని పెండ్లి చేసుకున్నదా?

### శుభలేఖ

నన్ను చేస్తో పుచ్చుకుని వసుంధరను చూడబోయిన స్నేహితురాలికి గూడ 1948 ఆగస్టుకు కలిగిన సందేహమే కలిగింది. వసుంధర చేసిన సందేహ నివృత్తిని వింటూంటే కాళ్ళకు పారాణి పూసుకున్నట్లయ్యింది నాకు.

### స్నేహితురాలు

వసుంధర యేమన్నదో తెలుసా? నాకా పట్టింపులు లేనే లేవన్నది. దాస్యానికి అలవాటు పడ్డ దేశస్థుల్లా ప్రతిదానికీ స్వాతంత్ర్యాన్ని ముడిపెట్టటం భావ్యంకాదన్నది. ఎవరి నెవరి కిచ్చినా, అందులో చెప్పుకోదగ్గభేదం యేమీ వుండదన్నది.

### తండ్రి

హమ్మయ్య! నా బాధ్యత తీరింది; కూతుర్ని వొక యింటిదానిని చేశాను. ఆరడుగుల అజానుబాహుడి ప్రక్కన నిలబడితే నా బిడ్డ పార్వతీ దేవిలా కనపించింది. పెళ్ళైంతర్వాత్ ఫోటో తీయించు కునేప్పుడాయన వేసుకున్న ఖాకీ డ్రెస్సూ, అమ్మాయి కట్టుకున్న ఆకుపచ్చంచు ఖద్దరు చీరా చూట్టానికి నా కళ్ళు చాల్లేదంటేనమ్మండి.

### కాలం

నేను గడుస్తాను. పరిస్థితులు మారతాయి. వ్యక్తుల్లో పరివర్తనం కలుగుతుంది.

### వ్యక్తులు

మేం మారుతూ, పరిస్థితుల్ని మారుస్తాం. కాలానికి కళ్ళెంవేసి, స్వారి చేస్తాం.

### పరిస్థితులు

మేం మారతాం. వ్యక్తులు మార్తారు. కాలం గడుస్తుంది.

### పడకగది

సింహాచలంగారు లేనప్పుడు బిక్కు బిక్కు మంటూండేదాన్ని. సింహాచలంగా రున్నప్పుడు ఆయన నవ్వుతూంటే, నా గోడల సున్నం చప్పుడు రాలినట్లు రాలుతూండేది.

ఆయన విజయోత్సాహంతో నవ్వుతూంటే-రోజుకో కొత్తచీరనలిగి, ప్రోగై, మడతలుచెడి, గుట్టగా మూల మూలలో పడేవి.

వసుంధర వచ్చింది; నా రూపు మారింది. నాగోడలు తెల్లనయ్యాయి. నా కిటికీలు తెరలు కట్టుకున్నాయి. గాంధీ మహాత్ముడి బోసినోటి నవ్వులూ, కస్తూరిబా కుంకుమా, సరోజినీదేవి కనుబొమల ప్రశ్నార్థకాలూ నాతోపాటు కళకళలాడినై.

### పడక మంచం

వసుంధర రాకపూర్వమే నేను బరువులు భరించలేక, మధ్యలో గుంటపడి, కుక్కినై పోయ్యాను. ఆ రోజులు తలచుకుంటూంటే, యిప్పటికీ నా కళ్ళు చెమరుస్తూంటాయి: రాత్రి రాక మల్లెపూల దండ నలిగి, వాడి, నల్లగా ఐపొయ్యేది; ప్రతి తెల్లవారు ఝామునా కొత్తకొత్త రేగిన తలలూ, చెరగిన కుంకమలూ ప్రత్యక్షమయ్యేవి. ఎప్పుడూ బాధతో మూలిగే నవ్వులూ, కోపంవచ్చి పెగలలేక, శబ్దాన్ని సృష్టించుకో లేక, వేయబోయిన కేకలు కొండనాలుకల్ని గూడా దాటని గొంతులూ, అలసిన మేనులు విరుచుకునే నరాల పెళుసూ, అనంగీకారాల ఆవులింతలూ, బద్ధకాల చిటికెలూ... నా బ్రదుకంతా ఆచుకోలేని బాధల్ని సహించుకోలేక మెలికెలు తిరిగి పొయ్యేది; కదలలేనికట్టెలా కొయ్యబారి పొయ్యేది. వసుంధర వచ్చింది; నా బ్రదుకు బాగుపడింది. అదే మొదలు నాకు, పరపురుషుడి నెరుగని స్త్రీ పతితో మనోవాక్కాయ కర్మలతో ఐక్యమవడం చూడడం.

### నలుగురూ

వసుంధరమ్మ మహా మంచిది. పోలీసు అధికారి పెళ్ళాన్నన్న గర్వమేలే దావిడకి. అందర్నీ నవ్వుతూ పలకరిస్తుంది, ఎవరు పిల్చినా పలుకుతుంది. ఆవిడ మా వాడకట్టు కొచ్చింది: పంపుదగ్గర పోట్లాటలు లేవు, పాచిదగ్గర పొరపొచ్చాలు లేవు, పాలపున్నమ్మ తుపుక్కున ఉమ్మివేసిన పాపాన పోలేదు. కూరగాయల వెంకన్న తక్కెడ తారట్లాడడం మానేసింది. పాకీ మనిషి ఈసడింపులు లేవు......

### కాలం

నేను గడుస్తాను. పరిస్థితులు మారతాయి. వ్యక్తుల్లో పరివర్తనం వస్తుంది.

### వ్యక్తులు

మేం మారతూ పరిస్థితుల్ని మారుస్తాం. కాలానికి కళ్ళెంవేసి స్వారీచేస్తాం.

### పరిస్థితులు

మేం మారతాం. వ్యక్తుల్లో మార్పు వస్తుంది. కాలాన్ని గడుస్తాం.

### 1949—50

కాలే కడుపుల కన్నంలేదు. పనిచేయనేర్చిన చేతులకు పనిలేదు. పారతంత్ర్యానికీ స్వాతంత్ర్యానికీ భేదం కన్పించలేదు; అంతా ఒకే తంత్రమే ననిపించింది. అంతా చూచిన అమాయకులు ఉలిక్కిపడి లేచారు. పీడకలను చెరిపేసి బ్రతుకు బాగు చేసుకోవాలనుకున్నారు.

## సింహాచలం

భక్షించని మనిషి రక్షించలేడు. భక్షించలేని వాడికి రక్షణ అవసరం లేదు. భక్షించే మనిషిని రక్షించడమే మా కర్తవ్యం. కర్తవ్యాన్ని కడకంటా సాగించడమే మా ధర్మం. ధర్మాన్ని పాటించాను; భక్షణ ప్రారంభించాను.

## ఊళ్ళు

కట్టగట్టుకుని నాశన మయ్యాం మేం. ఆంధ్రదేశం భారతదేశం కాదనిపించింది మాకు. ఏ పరాయి పాలనలోనూ, దండయాత్రలోనూ ఎరగని మొగలాయి చూడలేక కుతకుతలాడి పోయాం. మహాత్ముడు మేము పరిపాలనకు ప్రధానాంగాలం కావాలన్నాడు; కాని మా బ్రదుకు నంగా బ్రతుకైంది. మా పరువు బండలైంది. మా సంస్కారం స్మశానం పాలైంది.

సింహాచలానికి రెక్కలొచ్చిపడ్డయి. ఆ డేగ రెక్కలక్రింద మా జనం కోడిపిల్లలకంటె కనాకష్టమై పోయారు.

## కన్నీటి కాలువ

అమ్మా! వసుంధరమ్మా! నీవు మా వూరిలో పుట్టినదానివి. ఆడదానివి, చదువుకుని అందలా లెక్కకపోయినా, చదువురాని ఆడదాని కంటె బాగుపడక పోతావా అనుకున్నాం. కలెక్టరువారి భార్యవు కాకపోయినా, మా కష్టాలు తీర్పలేకపోయినా నీవు కష్టాలుండవులే అనుకున్నాం.

కష్టాలు లేకుండా అలాగే నాలుగు కాలలపాటు జీవించు తల్లీ!

మీ ఆయన సింహాచలం మేరువల్లా నిన్నాదుకుంటాడను కున్నాం. నిన్నాదుకుంటే మమ్మల్నాదు కున్నట్లే ననుకున్నాం.

అమ్మా! పాపం శమించుగాక. మీ ఆయన నీ పాలిటి మేరు వౌనో కాదో మాకు తెలియదు కాని, మా పాలిట మిత్తైనాడు. మా మానా లపహరించాడు. మా బ్రదుకు బజారున పడవేశాడు. మా పొత్తిళ్ళలోని బిడ్డల్ని చిత్రవధచేశాడు. మా నుదుటి కుంకుమ చెరచాడు; మా గాజులు పగల గొట్టాడు; మా మాంగళ్యం త్రెంచివేశాడు.

మా నోటిదగ్గర కూడు చెడగొట్టాడు. మా పొయ్యిమీద నీళ్ళు పారబోశాడు.......

## కన్నుల నిప్పులు

ఇదిగో వసుంధరా! నువ్వు నన్నెరిగే వుంటావ్. నువ్వూ నేనూ కలిసి చదువుకున్నాం. నువ్వు నన్నెరగవ్!

నేనూ నలభై రెండులో బ్రదికిన మనిషినే. మహాత్ముణ్ణింకా మరచిపోలేదు నేను.

క్రీస్తుతోపాటు ఆయనా చెప్పాడు ఈ చెంపను కొడితే ఆ చెంపను చూపమని. అలాగే ఒక చెంపను వాయించితే మరోచెంప చూపాను నలభై రెండులో.

ఇప్పుడు నా చెంపలు రెండూ వాచినై. ఇంకో చెంప చూపించేందుకు ఇక నాకు చెంపలు లేవు; నాకున్నది రెండు చెంపలే!

యితరుల చెంపలు వాయించడమే ఇక నాపని. సింహాచలం చెంపలు; అతనితో పాటు నీ చెంపలు.

నువ్వు గాంధీజీ శిష్యురాలివి. రెండు చెంపలూ వాయించే వరకూ వూరుకుంటావు; తర్వాతేం జేస్తావు ?

నా చెల్లెలి మానభంగంవల్ల నా చెల్లెలు పడుతూన్న బాధ నీకెలా అర్థమాతుంది, నీ మానభంగం జరిగితే తప్ప ?

నా భార్య నా ముందు, మా వూరి నాలుగువందల మంది ముందు నగ్నంగా నిలబడినప్పుడు నేను పడినవేదన నీ కెలా అర్థమాతుంది, నడిబజారులో నీ మానాపహరణం జరిగేవరకూ ?

నా కోసం నా బిడ్డ పలవరించి ప్రాణాలు వదిలాడే, నా గర్భశోకం నువ్వెలా అర్థం చేసుకోగలవు నీ కున్న ఒక్కబిడ్డనూ నేను పొట్టన పెట్టుకోనిదే ?......

మరణ వాంగ్మూలం

వ్రాసుకోండి మాజిస్ట్రేటుగారూ, నేను చెప్పదలచు కున్నదంతా చెప్పేవరకూ నా ప్రాణాలు నిలబడతాయో లేదో. త్వరగా వ్రాసుకోండి.

నే నిక బ్రదకలే ననుకున్నాను. బ్రదకవద్దనుకున్నాను.

నే నెప్పుడూ సిద్ధాంతాల మనిషినే. అలాగే చనిపోదామను కున్నాను.

నా కళ్ళముందు కాలువలు గట్టిన కన్నీటిని చూశాను; కణ కణలాడిన కన్నుల నిప్పులు చూశాను. అన్యాయం చూశాను; రాక్షసత్వం చూశాను.

ఆ రాక్షసుల్ని అంత మొందించందే నే నాత్మహత్య చేసుకో గూడదనుకున్నాను. ఆత్మహత్య పాపమని నాకూ తెలుసు. కాని - హత్యని యింటిలో దాచుకుని, కాఫీ యిచ్చి, అన్నం పెట్టి, ఆనందమిచ్చి, అనురాగం చూపడం నావల్ల కాలేకపోయింది; ఎవరో రాక్షసుడు, పురాణకాలంలో లాగా, ఉమాపతి రూపం ధరించివచ్చి నన్ను మోసం చేస్తున్నా డనిపించింది. నిజం తెలుసుకున్న ఏ పతివ్రత హత్యచేయకుండా వూరుకుంటుంది ?... ఏ పతివ్రత ఆత్మహత్య చేసుకోకుండా వూరుకోగలదు ? అందుకనే నాకుటుంబాన్ని నేనే అంతమొందించుకున్నాను. మీ చట్టం అందుకు నన్ను శిక్షించవచ్చు. శిక్షించుతుందని నాకు తెలుసు. కాని మీరు వేసేశిక్షకంటె ముందే నే నీప్రాణాలు విడుస్తాను. నా శరీరాన్నిక్కడే వదలి వెళ్తాను; మీరు దాన్ని శిక్షించుకోండి......

కాలం

నేను గడుస్తాను. పరిస్థితులు మారతాయి. వ్యక్తుల్లో పరివర్తనం వస్తుంది.

వ్యక్తులు

మేం మారుతూ పరిస్థితుల్ని మారుస్తాం. కాలానికి కళ్ళెం వేస్తాం; వేసి స్వారీ జేస్తాం.

పరిస్థితులు

మేం మారతాం; వ్యక్తుల్లో మార్పువస్తుంది; కాలాన్ని గడుస్తాం.

—o—

# జీపగడ్డ

సుంకర సత్యనారాయణ

[నిరంకుశ నిజాం ప్రభుత్వ హయామది; తెలంగాణా ఇంకా విముక్తం కాలేదు. జాగీర్దార్లు, దేశముఖులు వతన్‌దార్లు. మదోన్మాదులైన రజాకారులు ప్రజలను నరకయాతన పెడుతున్న రోజులు. వెట్టిచాకిరి, పన్నులు, లంచాలు, బేదఖళ్లు, తిట్లు, దెబ్బలు హత్యలు, మానభంగాలు... సర్వసామాన్యమైన రోజులవి. ఆ కాలంలో స్వాతంత్ర్య సముపార్జనకై బయలుదేరిన తెలుగు బిడ్డ చిత్రణ మిది.]

కంప గల భూమి మన వెన్గుమండలంబు
పసిడి పాతర కమ్మని పంటనిచ్చు
కామధేనువు ముష్కరుల్ ఖైను చేసి
ఊసర క్షేత్రముగ మార్చివేసినారు.

మన్ను శ్రమజీవి భూమికి దూరమయ్యె
అతని సర్వము సోమరులపహరించి
మేలుకొను మన్నారు అతనికి కూడు లేదు
అతడు క్రోధించి పిడికిట్లు లవతరించె.

ఆ కఠినాత్ములైన దొరలాస్తి సమస్తము దోచివైన చీ
కాకయి కాపురంబు దరిగానక చింతిలి యెట్టకేల కి
ట్లాకలి గొన్న సింహమట్లు లాహవభూమికి దూకినాడు పో
కూకటి వేళ్ళతో రిపుల గూల్చు తలంపున ఖడ్గధారియై.
"పిడకకొల్మి తిత్తి నవివేకముగా పదిసారులొత్త బు
స్సుడుచు కుందనంబు నది యాహుతి చేయదె వహ్నికిన్ వ్యథా
పీడితునింక తీవ్రతర పీడన కగ్గముసేయ నమ్మహా
పీడిత డల్గి నిన్ను పృథివీస్థలి దగ్ధముసేయు నమ్మెయిన్"
అని వదాన్యుడు ఘనుడు పల్కెను కవీశు
ఆ మహాయోగి సత్యవాక్యము ఫలింప

బాధితుని యింట్ల బుట్టి విరోధిమూక
ల నురుమాడు యోధుడు గెరిల్లాయితండు.

సిలుగులకోర్చి దున్న, తన చెమ్మట లానుచు మెచ్చి మంటలో
మొలిచిన పంట తల్లిని యమూల్య ఫలంబును, నీచు లెవ్వరో
యలము కొనంగ పేదహృదయాన రగుల్కొని మండు మంట లో
పల ప్రభవించి నాడగుల బట్టి వధింపగ వీరభద్రుడై.

నేతలన్ ముంచిన నైరుల
హత మారచి నేను వచ్చునంతకు నీవే
సతమతమై బ్రతికించుము
అతివా బిడ్డలను రెక్కలాధారముగా.

నన్నో మగ కేయింబవ
లెన్నో కష్టాలుపడిన దీ తల్లి ఋణం
బెన్నాళ్ళకు తీర్చెదనో
కన్నాకై వృద్ధురాలి గావుముసాధ్వీ.

అనుచు కుటుంబ భారమును ఆలి భుజంబులపైన మోపి నం
దనులను ముద్దులాడి చని తల్లి పద ద్వయమంటి యామె దీ
వెనగొని పేదబిడ్డ డరిభీకరుడై వెడలెన్ తుపాకి చే
గొని నిజగర్భ శత్రు మదకుంజరయూధ వినాశనార్థమై.

కన్నులు విప్పినాడరుణ కాంతుల లోకమునింపినాడు ఢీ
కొన్నయరాతి మూకలను గుమ్మి ధనాఢ్యుల పెత్తనంబులన్
గ్రన్నన గూల్చి దేశమును గాచి దరిద్రము దీర్చుదాక నే
నెన్నడు దించబోన నిపుడెత్తిన కత్తినటంచు దీక్షతో.

నడి నడి పంచ గట్టి, తలపాగ దిటంబుగ జుట్టి, నల్లెలో
నడుము బిగించి కట్టి, తననాటు తుపాకిని చేతపట్టి, అ.
చ్చొడిదపు గండ్రగొడ్డలిని పెట్టి భుజంబున, జేలుగొట్టి, కా
రడవెల కేగినా డతని రక్షణ శిక్షణ లన్ని యచ్చటే.

పగవాడు బాంబులు పడవేసి బ్రద్దలు
        గొట్ట పేమూడని కొండకోట
మబ్బుదివ్వెల గూడి మాటాడు తత్ శిఖ
        రాగ్ర మరిచలన మరయు బురుజు
గిరి చుట్టు పాతాళ మొరసి లోతులుదీరి
        వైరి దాటగనీని వాగడ్డ
శత్రువే కాదందు చనిన బెబ్బులి కూడ
        మగిడి రాదా గవి మందుకొట్టు
ప్రజలు నీవారు పైన యీ ప్రకృతి బలము
కలిగి యున్నావు వైరులు కదనభూమి
బలగముల దించి యాటముగాంబు వేసి
చచ్చి గీ పెట్టి నిన్ గెల్వజాలరయ్య.

అంగ్లేయ ప్రభువు లల్లాడ దాకిన సీత
        రామ రాజు మహో పరాక్రమంబు
తెలుగు రైతు పటుత్వ దీప్తు లెగబోసిన
        పలనాటి హనుమంతు పౌరుషంబు
కైజారు చేబూని నైజాము నెదిరిన
        సరవాయి పాపని సాహసంబు
పసిగ్రాస మరికట్టు వసుదేశు నొంచిన
        కాటమరాజు-సంగ్రామ పటిమ

ఒక్క ముద్దగ జేసి నీకుగ్గుతోడ
కలిపి పెట్టినదేమొ నిన్ గన్నతల్లి
ఎదిరి మూకలు మెలినెట్టి గదుముచున్న
బెదర వానంత, యే పిక్క చెదరలేదు.

—o—

# చిరస్మరణీయుడు మన మాధవపెద్ది



ఆంధ్ర నాటక రంగంమీద మేటి నటుడని పేరు పొందిన శ్రీమాధవపెద్ది వెంకట్రామయ్యగారు 1957 మార్చి 19 వ తేదీన తెనాలిలోని వారి స్వగృహంలో 60 వ ఏట కాలధర్మం చెందినందుకు ఎంతో విచారిస్తున్నాం.

వీరు పుట్టినది తెనాలి తాలూకా బ్రాహ్మణకోడూరులో. కాపురం తెనాలిలో. మంచి యుక్తవయస్సులోనే తెనాలి రామవిలాససభలో చేరి శివాజీ పాత్రాభినయంలో తమకళా ప్రతిభను చాటిచూపారు. సాక్షాత్తు శివాజీయే ఇక్కడ ప్రత్యక్షమయాడా అనిపించేదట వీరి వేషం. శివాజీవేషంలో మొలకెత్తిన వీరి కళాభిజ్ఞత దుర్యోధన పాత్రాభినయంలో పతాకస్థాయినందుకుంది. ఆంధ్రప్రజా హృదయాలలో సుస్థిరస్థానం సంపాదించుకుంది. నాటికీ నేటికీ దుర్యోధన పాత్రాభినయంలో ఇంతటిమేటి లేడనడంలో అతిశయోక్తి లేదు.

బొబ్బిలిలో రంగారాయుడుగా, ప్రతాపరుద్రీయంలో ప్రతాపరుద్రుడు, వల్లీఖాన్‌గా, సోరాబు – రుస్తుంలో సోరాబుగా ప్రజా హృదయాలను చూరగొన్నారు. ఏలూరు నాటకకళా పరిషత్ అధ్యక్షపీఠంనుంచి వీరిచ్చిన మహోపన్యాసం ప్రతి నటుడు అధ్యయనం చేయదగినది. వ్యక్తిగతంగా అమృతహృదయులు, సరసులు, పరోపకార పరాయణులు. నాట్యకళాసేవ జీవిత పరమార్థంగా పెట్టుకున్న ఈ మేటి నటునికిదే మా శ్రద్ధాంజలి.

నాటిక

# దగ్ధశాంతి

బెల్లంకొండ రామదాసు.
రెంటాల గోపాలకృష్ణ.

ఇందులో పాత్రలు:

వేదాంతి: వయస్సు సుమారు 50. గంభీరంగా ఉంటాడు. ముఖం ఆలోచనాపూరితంగా ఉంటుంది.

కమాండర్: వయస్సు సుమారు 32. మిలిటరీ యూనిఫారమ్. బలమైన శరీరం, స్ఫురద్రూపి.

ఆఫీసర్లు: వయస్సు 35. కమాండర్ లాగానే ఉంటారు.

సోల్జర్లు: వయస్సు 30. సోల్జర్ల యూనిఫారమ్.

కన్య: వయస్సు 15. అమాయకత ఉట్టిపడే ముఖం. దుస్తులు ఆకులూ పూలూ. చలాకీగా ఉంటుంది. నిరలంగా మాట్లాడుతుంది.

కాలం:- విశ్వసంగ్రామం జరుగుతున్న సమయంలో.

ప్రదేశం:. ఈ వికల విశ్వ కల్లోలానికి దూరంగా చల్లని మంచుకొండలమధ్య ఒక చిన్న కుటీరం. ఆ కుటీరంలో వృద్ధుడు, విజ్ఞాని, అయిన ఒక వేదాంతి నివసిస్తున్నాడు. యుద్ధం, పరస్పర పీడన, కనిపించని నూతన మానవ నాగరికతను గురించి ఉదాత్త జీవిత స్వరూపాన్ని గురించి అన్వేషణ చేస్తున్నాడు. పూర్వం ఆ వేదాంతి మన ప్రపంచంలో నివసించి, మనమధ్య ఉన్న వైరుధ్యాలను అవగతం చేసుకున్నాడు. అతను ఒక అనాథ బాలికను మన నాగరికతలోని కల్మషం అంటకుండా వివిక్తంగా పెంచాడు.

దృశ్యం:- తెరవిడగానే వేదాంతి కుటీరం లోపలిభాగం కనిపిస్తుంది. ఒకకొయ్యకుర్చీ, ఒక టేబిల్, టేబిల్ మీద వ్రాతప్రతులు. పుస్తకాలతో నిండిన ఒకబీరువా. గోడకు అశోకచక్రవర్తి, బుద్ధుడు, జీసస్, మొదలైన మహాత్ముల పటాలు తగిలించి ఉంటాయి. తెల్లని పావురాయి ఉంచిన పంజరం కుటీరంలో ఒక మూల వ్రేలాడగట్టబడి ఉంటుంది. వేదాంతి ఏకాంతంగా

కూర్చొని గ్రంథపఠనం చేస్తుంటాడు. అది ప్రాతః కాలం. లేత ఎండ కిరణాలు ప్రసరిస్తుంటాయి. మేల్కొంటున్న పక్షుల కలకలారావం వినిపిస్తుంటుంది, దూరంగా, అవ్యక్తంగా, సన్నని సంగీతం వినిపిస్తుంది. అదృశ్యంగా

'తమసోమా జ్యోతిర్గమయ
అసతోమా సద్గమయ
మృత్యోమా అమృతంగమయ'

శ్లోకపాదాలు వినిపిస్తుంటాయి. వేదాంతి నెమ్మదిగా లేచి కుటీరద్వారం దగ్గరికి వెళ్ళి ఎవరికోసమో చూచి మళ్ళీ తిరిగివచ్చి చదువుతూ కూర్చుంటాడు. హఠాత్తుగా ఓ 15 సంవత్సరాల కన్య భయంతో పరుగెత్తుతూవచ్చి వేదాంతి కౌగిట్లో ఒదిగి పోతుంది. కన్య, పూలతో, ఆకులతో అరణ్య స్త్రీలాగ విచిత్రంగా అలంకరించుకొని ఉంటుంది.]

కన్య:-నాన్నా! నాన్నా! నాన్నా! నాన్నా!

[భయంతో వేదాంతి కౌగిట్లో ఒదిగి పోతుంది]

వేదాంతి:- ఏమిటమ్మా? ఎందుకమ్మా అలా వణికిపోతున్నావు? ఏంజరిగిందమ్మా?

కన్య:- [అస్పష్టంగా] నాన్నా! నాన్నా!

వేదాంతి:- ఏమిటమ్మా!

కన్య:- [భయంతో నెమ్మదిగా] ఇలా రానాన్నా! ఇలారా!

[భయంతో వేదాంతిని ద్వారంవద్దకు తీసుకొని పోతుంది]

కన్య:-అటుచూడునాన్నా! అటుచూడు.

[ఇరువురూ పర్వతశిఖరం మీదినుంచి క్రింద లోయలోకి చూస్తారు]

కన్య:- చూడు నాన్నా ఆ జనం ఆలోయలో.

వేదాంతి:- అవునమ్మా!

కన్య:- ఎక్కడికి నాన్నా వాళ్ళందరూ వెడుతున్నారు. ఎంతమంది! ఎక్కడికి నాన్నా, వాళ్ళు వెడుతున్నారు.

[నిశ్శబ్దం. దూరంగా అవ్యక్తంగా, యుద్ధ భయంతో తమ గ్రామాలు వదలి పరదేశానికి పోతున్న ప్రయాణీకుల సమిష్టిగానం మెల్లగా వినిపిస్తుంది.]

"హైలెస్స, హైలెస్స, హై
ఏ రోజు ఏ కష్టం రానున్నదో
ఏ ఊరు ఏ గంగ ఋణమున్నదో
హైలెస్స, హైలెస్స, హై"

వేదాంతి:- ఎక్కడికో వెడుతున్నారమ్మా! నీ వెళ్ళి ఆడుకో తల్లీ!

కన్య:- [ముకుపగా] కాదు నాన్నా. నాకు చెప్పవ్. ఎవరు నాన్నా వాళ్ళు. ఎక్కడికి వెడుతున్నారు చెప్పవ్.

వేదాంతి:- నామాట వినుతల్లీ! నీవెళ్ళి ఆడుకో. ఈ అడవిలో నీ కేం భయం? హాయిగావెళ్ళి ఆడుకోతల్లీ!

కన్య:- అబ్బ. నాకేం తోచడంలేదు నాన్నా. ఎందుకో భయంగా ఉంది నాన్నా.

వేదాంతి:- ఏం భయంలేదు. వెళ్లి ఆడుకో తల్లీ!

కన్య:- ఇవాళ అడవి బాగా లేదు నాన్నా.

వేదాంతి:- ఏం తల్లీ! అడవి నీకూ స్నేహంగా!

కన్య:- అడవికి నామీద కోపంవచ్చింది నాన్నా. ఇవాళ నన్ను పలకరించలేదు.

వేదాంతి:- [నవ్వుతూ] అడవికి కోపమేమిటి తల్లీ!

కన్య:- అవును నాన్నా. అడవి రోజూలా లేదు నాన్నా. ఏదో పెద్ద దిగులుగా ఉంది. ప్రతి ఉదయం నేను ఆడుకో

డానికి వెడితే ఆనందంగా పొంగిపోయేది. ఇవాళ ఆడవంతా దిగులుపడుతూ కూర్చుంది నాన్నా. నేను వెళ్ళగానే చెట్లన్నీ తలలు వాల్చుకున్నాయి. పూలు పలకరించలేదు. ఆకులు గలగలా పిలవలేదు. జలపాతం సన్నగిలి కన్నీటిలా జాలు వారుతోంది. పిట్టలు గూళ్ళు వదిలినా చేతుల్లోకి రాలేదు. నెమళ్ళు భయభయంగా పరిగెత్తిపోయాయి. లేళ్లు కంపించాయి. రోజూ ఎంతో హాయిగా నాతో ఆడుకునే పావురాయి కూడ ఇవాళ భయంతో రెక్కలు ముడు చుకొని కూర్చొంది నాన్నా. ఇవాళ ఆడ వంతా రాయిలా నిద్ర పోతోన్నట్లుంది నాన్నా. ఎంతసేపు పిలిచినా పలకలేదు. ఆ నిశ్శబ్దంలో నా పిలుపుకు నేనే భయ పడ్డాను. నాన్నా! నాన్నా! నా కెం దుకో భయంగా ఉంది నాన్నా!

[పావురాయి పంజరం పట్టుకొని చూస్తూ నిలుచుంటుంది]

వేదాంతి:- [ముఖంలో వేదన కనిపి స్తుంది.] భయంలేదులే తల్లీ! నీవింట్లోనే ఉండు. [నిశ్శబ్దం. మిలిటరీ లారీలు వెడు తున్న శబ్దం. సోల్జెరు కదంతొక్కుతూ పోతున్న శబ్దం, అరుపులు, కేకలు విని స్తాయి.]

కన్య:- నాన్నా. [కంపిస్తుంది] నాన్నా అదేవిటి నాన్నా. ఎవరో రాక్షసులు అరుస్తూ పోతున్నట్లున్నారు.

వేదాంది:- రాక్షసులు కాదమ్మా! మనుష్యులు.

కన్య:- మనుష్యులయితే అట్లా అరు స్తారా నాన్నా.

వేదాంతి:- మనుష్యులు, ఎప్పుడు మను ష్యులుగా ఉండరమ్మా.

కన్య:- నాన్నా. మనుష్యులెలా ఉం టారు నాన్నా!

వేదాంతి:-పిచ్చితల్లి. మనలాగే ఉంటా రమ్మా!

కన్య.- మనుష్యులు మంచిగా ఉంటారా నాన్నా?

వేదాంతి:- మనుష్యుడు మంచివాడే నమ్మా. మనుష్యులతో కలిస్తే...

కన్య:- నాకో మనిషిని చూపించు నాన్నా!

వేదాంతి:- మనం మనుష్యులమేనమ్మా!

కన్య:- నిజంగా! నీవూ, నేనూ మను ష్యులమేనా నాన్నా!

వేదాంతి:- అవునమ్మా!

కన్య:- అయితే మనం ఆగవ్వేం నాన్నా!

వేదాంతి:- పిచ్చితల్లీ. వెళ్ళి ఆడుకో.

కన్య:- ఎప్పుడూ ఆటలేనా? నాకు మనుష్యులు ఎలాఉంటారు? ఎక్కడుం టారు? ఏంచేస్తుంటారు? చెప్పవు నాన్నా?

వేదాంతి:- తర్వాత ఎప్పుడైనా చెప్తా లేమ్మా!

కన్య:- [విసుగ్గా] నీ వెప్పుడూ ఇంతే నాన్నా. అన్నీ చెప్తావు కాని మనుష్యుల సంగతి చెప్పవు. ఇప్పుడే చెప్పు నాన్నా. నాకేం తోచడంలేదు.

వేదాంతి:- ఏం చెప్పమంటావమ్మా!

కన్య:-మనుష్యులసంగతిచెప్పు నాన్నా. మనుష్యు లెక్కడ ఉంటారు నాన్నా!

వేదాంతి:-అన్నిచోట్లా ఉంటారమ్మా.

కన్య:- ఏంచేస్తుంటారు నాన్నా.

వేదాంతి:- ఏంచేస్తారమ్మా బ్రతుకుతూ ఉంటారు.

కన్య:- అంటే?

వేదాంతి:- నీవు వెళ్ళి ఆడుకో తల్లీ తర్వాత చెపుతాన్లే.

కన్య:- [మారాం చేస్తూ] కాదునాన్నా ఇప్పుడే చెప్పు నాన్నా.

వేదాంతి:- బ్రతకడమంటే ఏముంది దమ్మా! పుడతారు, బ్రతుకుతారు, పోతారు.

కన్య:- ఎలా పుడతారూ? ఎక్కడికి పోతారూ?

వేదాంతి:- ఎలా పుడతారో తెలీదమ్మా! ఎలా బ్రతుకుతారో కొంచెం తెలుసు. ఎక్కడికి పోతారో అసలు తెలీదమ్మా!

కన్య:- [నవ్వుతూ] భలే! భలే! రావడం తెలీదు, పోవడం తెలీదు. ఉండడం మాత్రం ఎలా తెలుస్తుంది నాన్నా? అన్నీ అబద్ధాలు. నిజంచెప్పు నాన్నా.

వేదాంతి:- పిచ్చిపిల్లా!

కన్య:- పో నాన్నా. నాకేం చెప్పవ్. అన్నీ దాస్తావ్. పోనీలే. ఆ బ్రతకడం నీకు తెలుసుగా. అది చెప్పు. మనుష్యులెలా బ్రతుకుతారు నాన్నా? అడవిలో ఆడుకుంటారా? పాటలొచ్చా? పూలతో, పిట్టలతో, చెట్లతో మాట్లాడతారా? వాళ్లెలా బ్రతుకుతారు నాన్నా?

వేదాంతి:- తర్వాత చెప్తాలే తల్లీ! ఏదైనా ఓ పాటపాడు.

కన్య: నీవు చెప్పు. నేను పాడతా

వేదాంతి:- నీవు పాడు నేను చెప్తా.

కన్య:- పో నాన్నా! మరీని.

వేదాంతి:- పాడుతల్లీ!

కన్య:- ఏంపాట పాడను?

వేదాంతి:- రోజూ ఉదయాన, సాయంత్రం పాడుతూ ఉంటావే, అది.

కన్య:- గొంతు బాగాలేదు నాన్నా.

వేదాంతి:- పాడుతల్లీ! మా అమ్మవు కదూ!

కన్య:- పూర్వం బాగా పాడేదాన్ని. నాపాట వింటే కొమ్మలచాటు పూలు తొంగిచూచేవి. ఇప్పుడు నా గొంతు మారిపోయింది నాన్నా.

వేదాంతి:- నీ పాటకేం తల్లీ!

కన్య:-తల్లీ చల్లని శాంతి
ధారుణి పండించవమ్మా!
తల్లీ వెన్నెల కాంతి
ధారుణి నిండించవమ్మా!
పసిపాపలు నీ బిడ్డలు
పాలకడలి తరంగాలు
పసిహృదయం శశివదనం
విషతుల్యం చేయకమ్మా! తల్లీ...
మానవతా మందిరాన
మంటలు రగిలించకమ్మా
పుడమితల్లి పురిటిఇల్లు
బూడిదగా మార్చకమ్మా! తల్లీ...
ఆశాకుసుమాలమాల
అనురాగపు టుయ్యాల
అవని గర్భంలోపల
అగ్నిధార నింపకమ్మా! తల్లీ...
ఈ సుందర లోకంలో
వసంతం కురిపించుము
ఈ చంద్రుని హాసంలో
హేమంతం ఒలికించుము! తల్లీ...

[నృత్యం చేస్తూ పాటపాడుతుంది. నృత్యంలో మధ్యమధ్య, పంజరాన్ని గిర్రున తిప్పుతుంది. పాట హఠాత్తుగా ఆగుతుంది. విమానాల శబ్దం వినిపిస్తుంది. వేదాంతి, కన్య, ద్వారంవద్దకు వెళ్ళి చూస్తారు]

కన్య:-నాన్నా! అవేంపక్షులు నాన్నా! అలా అరుస్తూ పోతున్నాయి.

వేదాంతి:- అంతేనమ్మా ఆ పక్షులు.

కన్య:- అమ్మో! అంత పెద్దపక్షులే! ఎన్నడూ మనఅడవిలో చూళ్ళేదునాన్నా. [తిరిగి విమానాల శబ్దం. విమానాలు వెళ్ళి పోతాయి.]

అవిగో నాన్నా. మళ్ళీవచ్చాయి. ఆపక్షులు అలా ఉంటాయేం నాన్నా!

వేదాంతి:- నీవు నిద్రపో తల్లీ కాసేపు.

కన్య:- భయంగా ఉంది నాన్నా. నేను చెప్పలా ఇవాళ మంచిరోజు కాదని. నాకు తెలుసు. మసకతో లేచి అడవికెళ్ళాను. ఒకటే మంచు అబ్బ. సూర్యుడింతకూ ఉదయించాడు కాదు. రోజూ నేను స్నానానికి జలపాతం దగ్గరకి వెళ్ళగానే కళ్ళల్లో వెలుగు చల్లేవాడు. ఎంత పిలిచినా అడవి మేల్కొల్లేదు. అలిగినట్లు పడుకుంది. ఇవాళ ఉదయం, సాయంత్రంలా నిగులుగా ఉంది. నాన్నా నీవు చూస్తున్నావు. నాకు చెప్పవ్? చెప్పు నాన్నా.

వేదాంతి:- ఏంచెప్పను తల్లీ!

కన్య:- ఆ జనం ఎక్కడికి వెళుతున్నారు? ఆ రాక్షసులు ఎందుకు అరుస్తూ వెళ్ళారు? ఆ పక్షులు అలా ఎందుకు వెళ్ళాయి? ఆ మనుష్యుల కథ ఏమిటి?

వేదాంతి:- మనుష్యులు మళ్ళీ చంపుకుంటున్నారమ్మా!

కన్య:- ఎవర్ని నాన్నా?

వేదాంతి:- వాళ్ళను వాళ్ళే.

కన్య:- ఎందుకు నాన్నా?

వేదాంతి:- పడక.

కన్య:- పడకపోతే చంపుకుంటారా నాన్నా!

వేదాంతి:- అంతేనమ్మా! వాళ్ళంతే!

కన్య:- ఎందుకు నాన్నా వాళ్ళకు పడంది?

వేదాంతి:- అంతేనమ్మా! వాళ్ళందరూ ఒకలా ఉండరు. కొందరు గొప్ప, కొందరు తక్కువ. కొందరు కలవారు, కొందరు లేనివారు, కొందరు సుఖిస్తారు. ఒకరంటే ఒకరికి పడదమ్మా! మనిషి మనిషిని ద్వేషిస్తాడు. దేశం దేశాన్ని కబళిస్తుంది. జాతి జాతిని నిందిస్తుంది. ఇంతకాలం ఈ పృథ్వి మీద మనుష్యులు బ్రతికినా హాయిగా, అందంగా, నిర్మలంగా బ్రతకడం నేర్చుకోలేదమ్మా! ఎప్పుడూ ద్వేషంతో, హింసతో అల్లకల్లోల మవుతుంటారమ్మా.

కన్య:- అదేమిటి నాన్నా! మనుష్యులు మంచివాళ్ళంటివే? వాళ్ళకు గొప్ప నాగరికత ఉందంటివే? పెద్దవాళ్ళూ, ఇళ్ళు కట్టుకుని హాయిగా ఉంటారంటివే? గొప్ప విషయాలు ఆలోచిస్తారంటివే? అలా ఎందుకు చంపుకుంటారు నాన్నా? ఎందుకు ఈ హింస? చెప్పవూ?

వేదాంతి:- నిజమేనమ్మా! వాళ్ళు అన్నీ స్వాధీనం చేసుకున్నారు. కాని వాళ్ళను వాళ్ళు స్వాధీనం చేసుకోలేదమ్మా! వాళ్ళను వాళ్ళే చంపుకుంటారు. తమ నగరాలు తామే దహించుకుంటారు. వాళ్ళ బంధాలు వాళ్ళే నిర్మించుకుంటారు. వాళ్ళ నాగరికతే వాళ్ళనే వెక్కిరించింది. సుఖం కోసం ఎన్నో యంత్రాలు కనిపెట్టారు. మనసులేని యంత్రానికి మనసున్న మనిషి బానిసైనాడు. మనిషిచరిత్ర వింటే నీ మనసు కలవరపడుతుందమ్మా! మనిషి చరిత్ర మరి వినకు.

కన్య:- నాన్నా! నాకు భయంగా ఉంది నాన్నా! నీవు ఎంతో కాలం మనుష్యులతో ఉన్నావు కదా, వాళ్ళకు మంచి చెప్పలేకపోయావా నాన్నా?

వేదాంతి:- పిచ్చితల్లీ! [మళ్ళీ విమానాల శబ్దం వినిపిస్తుంది. క్రమక్రమంగా పెద్దదౌతుంది. దూరంగా విమానం కూలిన పెద్దశబ్దం వినిపిస్తుంది. వేదాంతి, కన్య, వెలుపలికి పరిగెత్తుతారు. రెండు నిముషాలు స్టేజి ఖాళీగా నిశ్శబ్దంగా ఉంటుంది. వేదాంతి, కన్య తిరిగివస్తారు, గాయపడిన ఒక 'కమాండర్'ను మోసుకొని. అతన్ని పక్కమీద పడుకోబెడతారు. వేదాంతి ప్రథమచికిత్స చేస్తాడు. లైట్లు మళ్ళీ మళ్ళీ

వెలుగుతాయి, కమాండర్ పక్కమీద పడుకొని ఉంటాడు. కన్య విసురుతూ ఉంటుంది. వేదాంతి పుస్తకం చదువుతూ... కూర్చొని ఉంటాడు]

కమాండర్:- (కలవరింపులో) ఆపండి, అబ్బ, ... నేను సంతకం పెట్టను... షేకిటాట్ ... నన్ను లాగకండి ... గెటౌట్ ... భయం ... అబ్బ ... భయం...

కన్య:- (వేదాంతి వంక చూచి) నాన్నా,

(వేదాంతి ప్రశాంతంగా వచ్చి 'కమాండర్' నుదుటిమీద తనచేతిని ఉంచి మళ్ళీ వెళ్ళి ప్రశాంతంగా చదువుకుంటూ కూర్చుంటాడు)

కమాండర్:- చూశాను. వన్ ... టు త్రీ — ఆ మెర్క్ ... లక్షలు (బిగ్గరగా) సైగాన్ ... నగరాలు ... మంటలు... పారిస్ ... న్యూయార్కు... మాస్కో... లండన్ నగరాలు ... భవనాలు...పిల్లలు...తల్లులు... మంటలు... (బిగ్గరగా) స్టాప్ ఆర్పండి మంటలు... పూలు...చెట్లు...పసి ... అడవులు ... స్టీమర్ ... ప్లేన్... నీటిలో మంటలు... మంటల్లో నీళ్ళు ... స్టాప్ ... అబ్బ... నిద్ర ... నన్ను వెళ్ళనివ్వండి ... నన్ను నిద్రపోనివ్వండి; స్టాప్ ...

కన్య:- నాన్నా,

(వేదాంతి తడిగుడ్డను తెచ్చి 'కమాండర్' నుదుటి మీద ఉంచుతాడు)

కమాండర్:- (మెల్లగా కలవరిస్తూ) అమ్మా, బాగున్నావా? వస్తా లే మళ్ళీ; తమ్ముడు కులాసాగా ఉన్నాడా? బడికి పోతున్నాడా?... డబ్బు అందుతూ ఉందా?...చిన్నమ్మాయి బాగుందా?... పెళ్ళి ఏర్పాటయిందా? ... కోడలు ధైర్యంగా ఉందా?... దిగులుపడకండి; వస్తాను; ఇదుగో; ఇవాళో రేపో ముగుస్తుంది; ముసురు పట్టింది; అబ్బ ... (బిగ్గరగా) అమ్మా! ...(మంచంమీద కూలిపోతాడు. వేదాంతి, కన్య అతన్ని పట్టుకుంటారు. క్రమక్రమంగా అతను నిద్రపోతాడు. కన్య మెల్లగా జోల పాడుతుంది)

ఎందుకు బాబూ
ఈ తొందరపాటూ?
ముందు వెనుక ఏముందో
ముందుగా ఆలోచించుము...
ఎందుకు బాబూ
ఈ తొందరపాటూ?

జోలపాడుతూ ఉన్నప్పుడు వేదాంతి వెలుపలికి వెళ్ళిపోతాడు. కన్యను పిలిచి ఏదో చెప్పి మళ్ళీ పంపిస్తాడు. దీపాలు మందగించి మళ్ళీ వెలుగుతాయి. 'కమాండర్' ప్రక్కమీదన ఉంటాడు. కన్య విసురుతూ ఉంటుంది. 'కమాండర్' మెల్లగా లేచి శూన్యదృష్టితో కుటీరాన్ని అంతా పరిశీలిస్తాడు)

కమాండర్:- ఇప్పుడు... ఎక్కడున్నాను? ఇది... మా ఇల్లేనా?

కన్య:- క్షేమంగానే ఉన్నారు. కొంచెం విశ్రాంతి తీసుకోండి.

కమాండర్:- ఇది మా ఇల్లేనా?...

కన్య:- ఆ, మీ ఇల్లే!

కమాండర్:- మా అమ్మేది?

కన్య:- మీ అమ్మ కావాలా?

కమాండర్:- మా అమ్మ...

కన్య:- మీ అమ్మ ఎలా ఉంటుంది?

కమాండర్:- నీలాగే ఉంటుంది.

కన్య:- నాలాగా ఉంటుందా? అయితే నేనే మీ అమ్మను.

కమాండర్:- నీవు మా అమ్మవా?

కన్య:- ఆ.

కమాండర్:- మరి చిన్నదానిలా ఉన్నావ్?

కన్య:- (తల్లిగొంతును అనుకరిస్తూ) నీకోసం దిగులుపడి చిక్కిపోయానునాన్నా.

కమాండర్:- అమ్మా, నాకోసం దిగులు పడ్డావా ?

కన్య:- అవును నాయనా నీవు వెళ్ళి నప్పటినుంచీ ఒకటే నాన్నా దిగులు. విస్తట్లో అన్నం పెట్టుకుంటే అదోలాఉండేది. ఇల్లంతా బోసిపోయేది. తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ, ఎప్పుడూ నీకోసం కలవరించేవాళ్ళు. మళ్ళీ నిన్ను కళ్ళతో చూస్తా ననుకోలేదు. ఎన్నాళ్ళకొచ్చావు నాయనా ?

కమాండర్:- అమ్మా! అమ్మా! నేనుమళ్ళీ వెళ్ళనమ్మా. (కన్యను కౌగలించుకుంటాడు)

కన్య:- వద్దునాన్నా. ఇక్కడేఉండు.

కమాండర్:- మరి, చెల్లెళ్ళూ; తమ్ముళ్ళూ ఏరమ్మా?

కన్య:- వస్తారు నాయనా. బడికెళ్ళారు.

కమాండర్:- (సందేహంగా) అమ్మా... మరి కోడలేదమ్మా...

కన్య:- వస్తుంది నాయనా.

కమాండర్:- అమ్మా నాకు నిద్ర వస్తోందమ్మా !

కన్య:- పడుకో నాయనా. నీకువంట్లో బాగాలేదు.

కమాండర్:- అమ్మా! సరే, చిన్న తనంలో నీవు ఎన్నోపాటలు పాడేదానివి. ఇప్పుడు ఒక్కటీ పాడవేమమ్మా ?

కన్య:- పడుకో నాయనా. అలాగే పాడతాను.

పాట : ఎందుకు బాబూ
ఈ తొందరపాటూ ?
ముందు వెనుక ఏముందో
ముందుగ ఆలోచించుము
కళ్ళకు కమ్మిన మైకం
కడిగిచూడ కనిపించును...ఎందుకు?
విశ్వవిలాస రేఖల్లో
అహర్నిశల ఆక్రందన
వినిపించుటలేదా,
విసిగించుటలేదా...ఎందుకు?
ఎండమావు లగుపిస్తే
గుండె చల్లబడదోయీ !
విషవృక్ష ఛాయలలో
విశ్రాంతియె లేదోయీ !
అగ్నిజ్వాలల ఒడిలో
ఆత్మశాంతి రాదోయీ; ఎందుకు ?

(ఆమె పాడుతూఉంటే అతను క్రమంగా నిద్రపోతాడు. దీపాలు మందగించి మళ్లీ వెలుగుతాయి. 'కమాండర్' ఆలోచిస్తూ కూర్చుని ఉంటాడు)

కన్య:— ఏం అలా ఉన్నారు?

కమాండర్:— (నెమ్మదిగాలేచి అటూ ఇటూ తిరుగుతుంటాడు)

కన్య:- మీ ఇంట్లో బాగాలేదా?

కమాండర్:- (మౌనం)

కన్య:- మాట్లాడరేం ? ఇక్కడే ఉండి పోండి. మీ దేశం వెళ్ళొద్దు.

కమాండర్:- ఏం ?

కన్య:- మీ దేశంకంటె మా దేశం బాగుందన్నారు కదా? నాన్నగారు మీ దేశాలన్నీ చూశారు. నేనొక్కసారైనా చూళ్ళేదు.

కమాండర్:- ఏరీ మీ నాన్నగారు ?

కన్య.- అడవిలోకి వెళ్ళారు. అప్పుడప్పుడూ అడవికివెళ్ళి అక్కడ గూడాలు చూచివస్తుంటారు.

కమాండర్:- మీ నాన్నగారు ఏం చేస్తుంటారు ?

కన్య:- ఎప్పుడూ ఏదో ఆలోచిస్తారు. రాస్తారు. నే నేదైనా అడిగితే 'చెప్తా లేమ్మా' అంటారు. నేను అడవికెళ్ళి పోతాను. నేనూ నా అడవి ఆడుకుంటాం. పొద్దుకూకి ఇంటికొస్తాను. మా నాన్నగారు

నాకో పాట చెప్పారు. రోజూ ఆ పాట పాడతా. ఉదయం, సాయంత్రం అది వింటుంటే ఆయన అశోకా అవుతారు.

కమాండర్:- మీ నాన్నగారు చాల మంచివారు. చూడు అటువైపు. [ఇరువురూ వెలుపలికి చూస్తారు] అదేమిటి ?

కన్య:- శిఖరం...

కమాండర్:-ఎలా ఉన్నదో చూచావా?

కన్య:- మా నాన్నగారూ నేనూ రోజూ ఆ శిఖరాన్ని చూస్తూ ఉంటాం, ఆ శిఖరాన్ని చూస్తుంటే ఏదో గొప్ప ధైర్యం వచ్చినట్టుంటుంది. మనస్సులో మెల్లని చల్లని పాట ఏదో వినిపిస్తుంది.

కమాండర్:- ఆ శిఖరంలా ఉంటారా మీ నాన్నగారు.

(కమాండర్ వెనుదిరిగి చూస్తాడు. అతనికి అశోకుని చిత్రం కనుపిస్తుంది. ఆ చిత్రం వద్దకు వెడతాడు)

కమాండర్:- ఈ పటం ఎవరిది ?

కన్య:- అతని కథ చెప్పనా ?

కమాండర్:- నీకు తెలుసా ?

కన్య:- ఓ. మా నాన్నగారు చెప్పారు.

కమాండర్:- ఈ పటంలో మనిషిని చూస్తే నా కెందుకో దిగులుగా ఉంది. సింహాసనంమీద అలా కూచున్నాడేం? అతని కథ చెప్పు.

కన్య:- అతనొక రాజు.

కమాండర్:- ఏదేశంలో ?

కన్య:- ఏదో దేశం. అతనొక రాజు. రాజంటే చిన్నరాజు కాదు. పెద్దరాజు.

కమాండర్:- ఊఁ.

కన్య:-ఆ రాజుకు పెద్దరాజ్యం ఉండేది. పెద్దసైన్యం ఉండేది. గొప్ప మంత్రులుండేవాళ్ళు. అందరూ అతను చెప్పినట్టు వినేవాళ్ళు.

కమాండర్:- ఊఁ.

కన్య:- ఇలా ఉండగా ఉండగా అతనికేం తోచిందికాదు. రాజ్యాన్ని మరీ పెద్ద రాజ్యం చేదా మనిపించింది. 'మంత్రులను పిలిచి, సైన్యాలు సిద్ధంచెయ్యండి. దాడి వెళ్ళాలి' అన్నాడు.

కమాండర్:- ఎక్కడికి ?

కన్య:- ఓ. చిన్న రాజ్యం ఉంది. దాన్ని మింగెయ్యడానికి.

కమాండర్:- ఊఁ.

కన్య:- వెంటనే సైన్యాలు బయలుదేరాయి. ఊళ్ళూ నదులూ పొలాలు దాటి వెళ్ళాయి. ఆ చిన్నరాజ్యంలో రాజు గజగజలాడి పోయాడు.

కమాండర్:- ఊఁ.

కన్య:- మూడురోజులు - పగలూ లేదు రాత్రీలేదు, పెద్దయుద్ధం జరిగింది. చిన్నరాజ్యం ఓడిపోయింది. జనాన్ని గడ్డికోసినట్టు కోశారు.

కమాండర్:- ఊఁ.

కన్య:- ఒకరాత్రి డేరాలో కూచుని ఈ రాజు ఆ యుద్ధభూమినంతా చూశాడు. రెండు రోజులకింద ఆడుతూ పాడుతూ హాయిగా ఉన్న మనుషులు - [బాధచూపుతుంది] ఆ రాజుకు మనస్సంతా కదిలినట్టయింది. ఎందుకు చేసినట్టు ఇదంతా ? ఏంవచ్చింది దీనివల్ల ?- ఇలా ఆలోచిస్తూ కూచున్నాడు ఆరాజు. ఎంతకూ తేలింది కాదు. ఆ రాత్రంతా అలాగే కూచున్నాడు.

కమాండర్:- తరువాత ?

కన్య:- ఉదయాన్నే మంత్రులూ సేనానాయకులూ విజయోత్సాహంతో వచ్చారు. రాజును చూచి నివ్వెరపోయారు. పలకడు. మాట్లాడడు. రాజుగారికి ఏదో జబ్బుపట్టుకుందనుకున్నారు. అప్పుడక్కడికి మానాన్నలాంటి వ్యక్తి ఒకడొచ్చాడు. భిక్షుకు

డంటారు. అతను రాగానే రాజుకు మనస్సు చల్లబడింది.

కమాండర్:- ఊఁ.

కన్య:- ఆ భిక్షుకుడు రాజుకు ఒకమాట చెప్పాడు.

కమాండర్:- ఏమని ?

కన్య:- 'రాజా! నీదిగులు నాకు తెలుసు నిప్పు నిప్పులో చల్లారదు. కోరిక కోరికను హెచ్చిస్తుంది. కోరికకు తీరడమనేదిలేదు. కోరిక కోసేస్తే శాంతి లభిస్తుంది. రాజా! ఈ మాట నేను చెప్పేదికాదు. నీలాగే ఒక రాజు పూర్వం అన్నీవిడిచి అన్నీతరచి అఖరుకు చెప్పాడు. ఈమాట చెప్పడం కోసం భార్యను రాజ్యాన్ని పుత్రుణ్నివిడిచి అర్ధరాత్రి అడవికి వెళ్ళాడు' అని

[కమాండర్ ద్రవించి ఆమెవద్దకువెళ్ళి మోకరిల్లుతాడు]

కమాండర్:- నేనూ ఆ రాజులా చేశాను. నేనూ ఆ రాజులా చంపాను. నన్ను క్షమించు. నాకు దోవచూపు.

[వేదాంతి ప్రవేశించి నిశ్శబ్దంగా చూస్తుంటాడు. కమాండర్ లేచి తలవాల్చుకుని వెలుపలికి వెడతాడు]

వేదాంతి:- ఏమిటమ్మా ?

కన్య:- ఏంలేదు నాన్నా. ఆ రాజు కథచెప్పాను. విన్నాడు. అలా అయినాడు.

వేదాంతి:- పిచ్చితల్లీ.

కన్య:-నాన్నా! నేనలా అడవికి వెళ్ళొస్తాను. అయన్ను కాస్త చూస్తూవుండండి.

వేదాంతి:- అలాగేనమ్మా.

[కన్య పాత్రనాయిని తీసుకొని వెలుపలికి వెడుతుంది, కమాండర్ ప్రవేశిస్తాడు]

వేదాంతి:- ఏంనాయనా ! ఎలావుంది ఆరోగ్యం.

కమాండర్:- నన్ను క్షమించండి. మీ ఋణం ఎన్నటికీ తీర్చుకోలేను. నాకు మీరు ఆశ్రియం ఇచ్చారు. కన్నకొడుకును చూచి నట్టు చూచారు. మీ సాన్నిధ్యం కోసమేనా ప్లేన్ ఇక్కడ కూలింది. ఎన్నాళ్ళనుంచో నన్ను దహిస్తున్న సమస్యలు చల్లారాయి. యుద్ధం, అబద్ధం, ధనం, దర్పం పరిపాలించే సమాజంలో పుట్టాను. పేద సంసారం. తిండికి సోల్జర్‌గా చేరాను. క్రమక్రమంగా కమాండరునైనాను. మానవులను చంపే విద్యలో అన్నిశాఖల్లో ఆరితేరాను. అబ్బ! ఇప్పటికి పదహారు నగరాలు క్షణంలో ధ్వంసంచేశాను. ఎన్నో లక్షల మందిని ఊచకోత కోశాను, నా పాపానికి కారణం ఎప్పుడూ ఆలోచించేవాణ్ని. నేను కాదేమో ననిపించేది. సంతృప్తిపడేవాణ్ని. నాకు ప్రశాంతి నశించింది. నాకు మనస్సు నశించింది.

వేదాంతి:-ఈపాపం నీదికాదు. ఈపాపం ప్రపంచానిది.

కమాండర్:- మీ అమ్మాయి ... తల్లిలా...

వేదాంతి:- అది వట్టిపిచ్చిపిల్ల నాయనా. దానికేం తెలీదు. అది ఎవరోకాదు. నా తోబుట్టువు కూతురే. గతయుద్ధంలో మా సంసారాన్ని యుద్ధం ఆహూతి చేసుకుంది. మా నగరం దగ్ధమైంది. నా చెల్లెలు చనిపోతూ, 'ఈ పసిదాన్ని నీ చేతుల్లో ఉంచి పోతున్నాను' అని కన్నుమూసింది. నే నీ పసిదాన్ని తీసుకుని ఈ అడవి చేరాను. ఇక్కడే ఈకుటీరం కట్టుకుని జీవిస్తున్నాను. దీన్ని ఈ నాగరికత సోకని అందమైన ప్రతిమగా పెంచాను. ఈ పిల్ల నా జీవితం. నా సందేశం.

కమాండర్:- నాకు భయంగా ఉంది. నా కోసం వెదకుతారు. నేను మళ్లీ వెళ్ళాలి. మళ్లీ చంపాలి. నన్ను బ్రతికనివ్వరు.

[కన్యభయంతో పరుగెత్తుకుని వస్తుంది.

విమానాలు వస్తున్న శబ్దం. ఒక క్షణం నిశ్శబ్దం. బూట్లచప్పుడు నలుగురు మిలిటరీ ఆఫీసర్లు వస్తారు]

ఒక ఆఫీసరు:- హల్లో

కమాండరు:- హల్లో

[ఇద్దరూ కరస్పర్శ చేసుకుంటారు]

ఒక ఆఫీసర్:- మొగాడ్. నీ కోసం వరల్డంతా వెదికాం. మన కంట్రీలో రోజూ ఇదే టాక్, పేపర్లన్నీ గొడవ-నీవు బహుశా ఎనిమీ క్యాంప్‌లోచేరి ఉంటావని.

మరో. ఆఫీసర్:- ఎనిమీస్ పట్టేశారని కొన్ని పేపర్లు.

మరో ఆఫీసర్:- వార్ మినిస్టర్ నిద్ర పోతే ఒట్టు. మినిస్ట్రీ అంతా దద్దరిల్లుతోంది. వెళ్లి టూమంత్స్ అయింది. హెడ్ క్వార్టర్సుకు రిపోర్టురాదు. చస్తున్నాం.

మరో ఆఫీసర్:- నేను మాత్రం ధైర్యం చెప్పేవాణ్ణి- 'మనవాడు అలెగ్జాండరు. నెపోలియన్, హిట్లర్ లను చంపిపుట్టాడు. మనవాడికి డిఫీట్ లేదని. అదీకాక వార్ మినిస్టర్ మిసెస్ మరీ కలవరిస్తోంది.

[ఆఫీసర్లు నవ్వుతారు]

[డ్రింక్ తీసి పానీయాలు తీసి త్రాగుతారు]

[ఒక ఆఫీసర్ ఒక గ్లాస్ పానీయాన్ని కమాండరుకు ఇస్తాడు]

ఒక ఆఫీసర్:- టేక్ ఎ బిట్.

కమాండర్:- వద్దు. థాంక్యూ. మీరు తీసుకోండి.

ఒక ఆఫీసర్:- అదేమిటి బ్రదర్, ఫండమెంటల్ రూల్స్ ఆఫ్ వార్ నే వైలేట్ చేస్తున్నావ్.

కమాండర్:- ఇప్పుడవసరంలేదు.

మరో ఆఫీసర్:- సన్యాసం పుచ్చుకున్నావా ఏమిటి?

[ఆఫీసర్లందరూ నవ్వి కుటీరాన్ని కలయ చూస్తారు]

ఒక ఆఫీసర్:- ఇదేదో ఆశ్రమంలా ఉంది.

కమాండర్:- అవును

ఒక ఆఫీసర్:- [వేదాంతిని ఉద్దేశిస్తూ] వీరెవరో చెప్పావుకావు.

కమాండరు:- మరిచాను. వీరు గొప్ప వేదాంతులు. ఇక్కడే నివసిస్తుంటారు, మానవులకు సన్మార్గం చూపడంకోసం అన్వేషిస్తుంటారు. ఈ అమ్మాయి వీరిపిల్ల. [వేదాంతితో] వీళ్ళు మా హెడ్ క్వార్టర్సు నుంచి వచ్చారు. నా తోటి కమాండరు]

వేదాంతి:- ఇవాళ ఇందరు అతిథులు రావడం ఎంతో సంతోషంగా ఉంది.

కమాండరు:-[ఆఫీసర్లతో] ఈకొండల ప్రక్కన నా ప్లేన్ క్రాష్ అయింది. నా కొలీగ్స్ అందరూపోయారు. వీరునన్ను రక్షించి ఇక్కడికి చేర్చారు. ఇప్పుడిప్పుడే కాస్త ఆరోగ్యం చేకూరుతోంది.

ఒక ఆఫీసరు:- [వేదాంతితో] థాంక్ యూసరు. మా ఛీఫ్ కమాండరును రక్షించి మాకు ఎంతో ఉపకారం చేశారు.

మరో ఆఫీసరు:- హెడ్ క్వార్టర్సుకు వెళ్ళగానే మీ ఆశ్రమానికి గొప్ప సబ్సిడీ పంపుతాం.

మరో ఆఫీసరు:- అసలు మీరు ఈ అడవిలో ఉండడం బాగాలేదు. మా కంట్రీకి రాండి. మీకు పెద్దభవనం, లైబ్రరీ అన్నీ ఫరునిష్ చేస్తాం. మీ కృషి అక్కడే సాగించండి.

మరో ఆఫీసరు:- ఎడ్యుకేషన్ మినిస్టరుగా వేయిస్తాం. వారుడేస్‌లో మన మాట ఛీఫ్ మినిస్టరు వింటాడు.

ఒక ఆఫీసరు:- వినకచస్తాడా; వినకపోతే వారు ఎండ్ చేస్తాం. తను పార్ల

సెంటర్‌లో స్పీచ్ చెబుతాడు కాని వెళ్ళి యుద్ధం చేస్తాడా ఏమిటి ?

మరో ఆఫీసరు:—[కమాండరుతో] సరే బ్రదరు ఇప్పుడు ఆరోగ్యం ఎలా ఉంది ?

కమాండరు:— ఫరవాలేదు.

ఒక ఆఫీసరు:— మరి ఈవినింగ్ వెళ్ళాలి మనం. ఇంకా ఎన్నో ఆపరేషన్స్ అలానే ఉన్నాయి. నీ క్రెడిటంతా డల్‌గా ఉంది. నీవు మిస్సయిపోవడం ఎనిమీకు పెద్ద ఛాన్సయింది. గోమ్ములు విరుచుకుంటున్నారు. ఇవాళో రేపో మరో ఫ్రంట్ ఓపెన్ చేసి ఎడ్వాన్స్ అవుతారట. ఫయర్ మస్ట్ గో ఎట్ వన్స్. దేరీజ్ నో టైమ్.

కమాండరు.— [మౌనం]

మరో ఆఫీసరు:— గెట్ రెడీ

మరో ఆఫీసరు:— ఓ.కే

మరో ఆఫీసరు:— గెట్ ఎలాంగ్

కమాండరు:— క్షమించాలి.

ఒక ఆఫీసర్:- అదేమిటి ?

కమాండరు:— క్షమించాలి. నేనురాను. నాకు యుద్ధాల్లో నమ్మకంలేదు. 10 సంవత్సరాల జీవితం యుద్ధాల్లో గడిపాను. హత్యల్లో గడిపాను. రక్తంలో గడిపాను. ఇక విశ్రాంతి తీసుకుంటాను.

మరో ఆఫీసరు:-ఇదేమిటోయ్ ? నీవేనా మాట్లాడుతున్నది !

మరో ఆఫీసరు:— పెద్ద ఫిలాసఫీలో పడ్డావేమిటి ?

మరో ఆఫీసరు:— ప్లేన్ క్రాష్‌లో సైంస్ కేస్ కూడా అయిందా ఏమిటి ?

మరో ఆఫీసరు:- ఏదో అనారోగ్యంగా ఉన్నట్టున్నాడు. ఊరుకోండి. (కమాండరుతో) అక్కడే విశ్రాంతి తీసుకోవచ్చు బ్రదర్. మన హెడ్ క్వార్టర్స్‌లో ఒక ఫుల్ మంత్ రెస్టు తీసుకో. అసలు నీవు ఉంటేకాని నీ ఆపరేషను మరొకరికి తెలీదు.

కమాండరు:— క్షమించాలి. నేను రాను. మీరూ నాలుగురోజులు ఇక్కడే ఉండండి. అన్ని విషయాలు తీరిగ్గా చెపుతాను.

ఒక ఆఫీసర్:- నాన్సెన్స్. మేము బయలుదేరి వీక్ అయింది. నీకోసం వరల్డంతా గాలించాల్సి వచ్చింది, హోల్ వార్ ఈజ్ సస్పెండెడ్.

కమాండర్:- ఫరవాలేదు.

మరో ఆఫీసరు.— రావయ్యా! [కమాండరు చెయ్యి పట్టుకుంటాడు)

కమాండరు:— వీల్లేదు నేను రాను.

ఒక ఆఫీసరు:— పిచ్చి పట్టినట్టుంది (వేదాంతివంక చూచి) మీరైనా చెప్పండి సారు! ఇతను మా చీఫ్ కమాండర్. ఆపరేటివ్ ప్లాన్సు అన్నీ ఇతనే నడుపుతాడు. మేము జీవన్మరణ యుద్ధంలో ఉన్నాం. క్షణంపోతే విజయం పోయినట్టు.

వేదాంతి:— అతనురాడు. మీ కిష్టమైతే మీరూ అతనిలా ఉండండి

ఒక ఆఫీసరు:— మైగాడ్ ! అయితే నీవేనన్నమాట ఇతనికి పిచ్చెక్కించింది యు హేవ్ కరప్టెడ్ హిమ్. ఇక్కడ నీ వేంచేస్తుంటావ్ ?

వేదాంతి:— (మౌనం)

ఒక ఆఫీసరు:— ఇతని మనస్సెందుకు పాడుచేశావ్ ? ఇతన్నెందుకు మార్చావ్ ?

వేదాంతి:— అతనేమారాడు. అతని మంచికే మారాడు. అతని మనశ్శాంతి కతనే మారాడు

మరో ఆఫీసర్:-ఈ బ్లడ్ఫూల్ యుద్ధ వ్యతిరేకిలా ఉన్నాడు.

మరో ఆఫీసర్:- మనకు టైంలేదు.

ఒక ఆఫీసర్:- (కమాండర్ తో) ఏవయ్యా! వస్తావా రావా ?

కమాండర్:- రాను.

ఒక ఆఫీసర్:- (వేదాంతితో) ఏమయ్యా పంపుతావా పంపవా ?

వేదాంతి:- అతనురాడు. నేను పంపను.

(ఆఫీసర్ విజిల్ ఊదుతాడు నలుగురు సోల్జెర్లు వస్తారు)

ఒక ఆఫీసర్:- ఈ పిల్లను తీసుకెళ్లండి.

కన్య:- నాన్నా. రాక్షసులు.

వేదాంతి:- వీల్లేదు.

ఒక ఆఫీసర్:- టేక్ హర్.

(కన్య, వేదాంతిని గట్టిగా కౌగలించుకుంటుంది. సోల్జెర్లు లాగుతారు)

వేదాంతి:- వదలండి, ఆ పసిపాపను ముట్టకండి.

కన్య:- నాన్నా, నాన్నా, రాక్షసులు ఇనుపచేతుల్లో నన్ను...

వేదాంతి:- మీకు పుణ్యముంటుంది కాని నా బిడ్డను వదలండి.

(ఒక ఆఫీసర్ వేదాంతి దగ్గరకి వెళ్ళి అతని చెంపమీద కొడతాడు)

ఒక ఆఫీసర్:- అతన్ని పంపించు. సేంగ్ సోల్జెర్ ! పార తీసుకరా. (వేదాంతితో) తీసుకో. (సోల్జెరతో) ఇతన్ని తీసుకెళ్ళి అతనిగోరీ అతనిచేతనే త్రవ్వించి పూడ్చేయండి.

(సోల్జెర్లు వేదాంతిని కన్యను బలవంతంగా లాక్కొని పడతారు. లోపల గోరీ త్రవ్వుతున్న శబ్దం, కన్య అరుపులు కేకలు వినిపిస్తాయి. (ఒక ఆఫీసర్ కమాండర్‌ను బంధిస్తాడు)

ఒక ఆఫీసర్:- ఇవ్వు దేమంటావు ?

కమాండర్:- లాభంలేదు. మీరు నన్ను చంపగలరు కాని నా చేత చంపించలేరు.

ఒక ఆఫీసర్:- షటప్ ఏ య్ సోల్జర్స్ ! (సోల్జెర్లు వస్తారు)

ఈ పుస్తకాలు తగల పెట్టండి. ఈ ఆశ్రమాన్ని ధ్వంసంచేయండి. ఇతన్ని ప్లేన్‌లో పడెయ్యండి. (ఆఫీసర్లు కమాండర్‌ను లాక్కొని పోతారు. సోల్జెర్లు ఆశ్రమాన్ని ధ్వంసంచేసి వెళ్ళిపోతారు. కన్య ప్రవేశిస్తుంది. అగ్ని తాపాలకు కములి పోయిన పండులాగా, కర్కశ హస్తాల్లో నలిగిపోయిన పుష్పంలాగా ఉంటుంది కన్య. ఆకాశంలోకి చూస్తూ అరుస్తున్నట్లు రేగి ఉంటుంది ఆమె జుట్టు. ఆమె చేతిలో పావురాయి ఉంటుంది. బరువుగా, బాధగా నడుస్తూ గానం ఆలాపిస్తుంది.

> తల్లీ చల్లని శాంతీ
> ధారుణి పండించవమ్మ !
> తల్లీ వెన్నెల కాంతీ
> ధారుణి నిండించవమ్మ !

శాంతి జీవించు -. శాంతి జీవించు.

(పక్షిని వదిలి వేస్తుంది. అది రివ్వున నింగిలో ఎగిరిపోతుంది. కన్య నేలపై ఒరిగిపోతుంది)

( తెర )

—०—

# తొలకరి నవ్వు

## "ఎల్లోరా"

వికసించిన పువ్వు నా జీవితం !
అభ్యుదయంకోసం నా జాతకం !!
నా జీవితానికీ
నా జాతకానికీ
వికసించిన పువ్వులతో
విడువలేని స్నేహబంధం !
విచ్చిన కలువలచందం !!

నా స్నేహం వికసించిన పువ్వు !
నా భావం తొలకరి నవ్వు !!

కలిమిలేములమధ్య
విసిగిన హృదయాలకు
వేసారిన జీవాలకు
కంటిముందు – యింటిముందు
మురిపించు నవ్వు !
వికసించిన పువ్వు !!

నా స్నేహం వికసించిన పువ్వు !
నా భావం తొలకరి నవ్వు !!

నవ్వుల పువ్వుల మదిలో
నా ఘంటపు కవితాఝరిలో
కనుపించును ఒక రేపొలిక !
వినుపించును ఒక రేకదలిక !!
చూడలేను తేడాయిక !
వికసించిన పువ్వు నా జీవితం !
అభ్యుదయంకోసం నా జాతకం !!
నా స్నేహం వికసించిన పువ్వు !
నా భావం తొలకరి నవ్వు !!

# ఎర్రపూలు

## 'చేరా'

బురద చెట్టును ఊపివేస్తే
అరుణ రక్తపు చుక్కలల్లే
ఎర్రపూవులు కాలమునకే
ఇంపుగా రంగేయునేమో ?

కటికి చీకటి జగతి నంతా
కమ్ముకుంటే ఎర్రపూవులు
అంధకారావృత జగమునకు
అందమును అనువిచ్చునేమో?

పొంగులెత్తు స్వకీయ రక్తమె
పూను నెర్రని పూల రూప
మ్మని ప్రతి నిమేషమ్ము తనలో
అనుకునే కూలీయె పంకము.

(మూలం "హరీన్ చటోపాధ్యాయ")



శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణగారు

తెలుగు భాషాసమితి నిర్వహించిన 1954-55 సంవత్సరం ఉత్తమ గ్రంథాల పోటీలో 'నాటకకళ' అను గ్రంథానికి శ్రీ రాధాకృష్ణగారు బహుమతి పొందారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తెలుగు భాషా సమితి ద్వారా రు. 500-0-0 లు బహుమతిని ఈ గ్రంథానికి ఇస్తుంది.

—o—

"భావి సంగరముప్పు బొటుబడనీక
జగతినిం గాపాడ సకల దేశములు
కవి మహాశయు లొక్కకట్టుగాఁవలయు
ఇదియెనా స్వప్నంబు; ఇదియెనా యాశ
కలయు నిక్కంబగు కాలంబురాదె?"

— కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

# అమెరికన్ ప్రచార చిత్రం "భవానీ జంక్షన్"

భారత దేశాన్ని కమ్యూనిజం నుంచి రక్షించడానికి అమెరికా పడుతున్న తాపత్రయానికి నిదర్శనంగా హాలీవుడ్ ప్రచారచిత్రం "భవానీజంక్షన్" ఈమధ్య మద్రాసులో విడుదలయింది. భారతీయ సంస్కృతికి బదులు హాలీవుడ్ సంస్కృతిని, భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర నిజస్వభావం బదులు అమెరికన్ పెట్టుబడిదార్ల నిజ స్వరూపాన్ని వెల్లడించే ఈ చిత్రం ఈ దేశంలో 'విజయవంతంగా' నడుస్తోంది.

జాన్ మాస్టర్స్ అనే బ్రిటిష్ రచయిత వ్రాసిన నవలను తీసుకుని ఎమ్.జి.ఎమ్. వారు మన దేశంలో "భవానీ జంక్షన్" చిత్రం తీయ సంకల్పించగా, మొదట్లో భారత ప్రభుత్వం అనుమతి నిరాకరించింది. భారతీయులను, స్వాతంత్ర్యోద్యమాన్ని ఆ నవల అవమానించే ధోరణిలో ఉండటమే దానికి కారణమని ప్రభుత్వం తెలియజేసింది.

తరువాత ఎమ్.జి.ఎమ్. వారు పాకిస్థాన్‌లో ఈ చిత్రం నిర్మించారు. భారత ప్రభుత్వం మొదట అభ్యంతరం తెలిపి, తరువాత విడుదలకు అనుమతించింది.

"భవానీ జంక్షన్" హాలీవుడ్ నుంచి వెలువడే చిత్రాలలో అధమజాతికి చెందినదవడంలో సందేహం లేదు. జనానికి వినోదం కలిగించడమే తమ ఆశయమని హాలీవుడ్ నిర్మాతలు పదేపదే చెబుతూంటారు గాని, వారి "వినోదం" వెనక ఘోరమైన ప్రచారం ఉంటుందని ఈచిత్రం చూచి తెలుసుకోవచ్చు.

1947 ఆగస్టులో కథ ప్రారంభమవుతుంది. బ్రిటిషువారు దేశం వదలిపెట్టి పోతున్న సమయమది. ఒక ఆంగ్లోఇండియన్ యువతికి (ఆవాగార్డ్నర్) ఒక 'సమస్య'' ఎదురవుతుంది. తాను పుట్టి పెరిగిన భారత దేశాన్ని ప్రేమించాలో, దేశంవదలి వెళ్ళిపోతున్న బ్రిటిష్ ప్రభుత్వాన్ని ప్రేమించాలో తెలియక మథనపడుతుంది. చివరికి తాను భారత దేశానికి చెందిన మనిషినేనని నిశ్చయించుకుంటుంది. కాని తన హృదయాన్ని మాత్రం ఒక బ్రిటిష్ సైనికాధికారి (స్టివార్ట్ గ్రేంజర్) అంకితం చేసుకుంటుంది. ఈ చిత్రం ప్రధానా



శయం ఇదే అయితే అట్టే బాధ పడవలసిన అవసరంలేదు. కాని ఈ కథను అడ్డం పెట్టుకుని సత్యాగ్రహోద్యమాన్ని హాస్యాస్పదంగా చూపించడం; కమ్యూనిస్టులను రాక్షసులుగా చూపించడం జరిగింది.

నిర్మాతల అంచనా ప్రకారం కాంగ్రెసుపార్టీ వారి సత్యాగ్రహోద్యమం "ఫరవాలేదు, మంచిదే". సత్యాగ్రహ దళ నాయకుడు బఫూన్‌లాగ ప్రవర్తించినా, పాపం మంచి వాడే. శాంతియుతంగానే ప్రదర్శనలు, రైళ్ళాపడం వగైరాలు ప్రారంభమవుతాయి. ఎటొచ్చీ అసలు విలన్ కమ్యూనిస్టుపార్టీ. శాంతంగా ప్రారంభమైన సత్యాగ్రహాన్ని కమ్యూనిస్టులు హింసాత్మకంగా మారుస్తారు. కొంతమంది రౌడీలను పంపించి పోలీసుల మీదా, బ్రిటిష్‌అధికార్ల మీదా రాళ్ళురువ్విస్తారు. కొన్ని రాళ్ళు సత్యాగ్రహులమీదకూడా రువ్విస్తారు. అయినప్పటికీ బ్రిటిష్ అధికారులు ఎంత బంగారుబాబులంటే, సత్యాగ్రహులమీదగాని రౌడీల మీదగాని ఒక్కతుపాకీఅయినా పేల్పించరు. సత్యాగ్రహులలో చాలామంది దెబ్బలు తింటారు. ఆ దెబ్బలు బ్రిటిష్ వారు కొట్టించినవి కాదుసుమండీ, కమ్యూనిస్టు రౌడీలు కొట్టినవే. కమ్యూనిస్టు నాయకుడు డార్కే (?) ను తమ వెలుగునీడల ఫొటోగ్రఫీ నైపుణ్యామంతా ఉపయోగించి పైశాచికంగా చూపించారు నిర్మాతలు. ఆఖర్లో ఆకమ్యూనిస్టు ఒక రైలును డైనమైట్ చెయ్యడానికి ప్రయత్నిస్తాడు. అతగాణ్ణి ఎంతో మంచి వాడైన ఒక బ్రిటిష్ ఆఫీసరు హతమారుస్తాడు. వెంటనే ఆంగ్లోఇండియన్ యువతి అతన్ని అమాంతం ప్రేమించేస్తుంది. కమ్యూనిస్టు నాయకుణ్ణి నిర్మాతలు తమ "గాంగ్‌స్టర్" చిత్రాల్లో కనబడే గ్లామరస్ విలన్‌లోంచి గ్లామర్ మాత్రం తీసివేసి చిత్రించారు. కమ్యూనిస్టులచేత రైళ్ళు పడగొట్టించి, గాయపడినవారిని క్లోజప్‌లలో చూపించి ప్రేక్షకుల హృదయాలను కదిలించాలని ప్రయత్నించారు. ఇటువంటి చవకబారుచిత్రం తీసి, భారతీయులకు నీతిబోధచేసే అర్హత, అగత్యం అమెరికనులకు ఎక్కడుందో దురూహ్యం.

—o—

# పుస్తకపరిచయం

## దేవదత్తం

(గేయసంపుటి)

రచన :

శ్రీ కాకుమంచి వెంకటేశ్వరరావు.

వెల: ముప్పావలా.

నీనా ప్రచురణ – గుంటూరు.

ప్రతులకు : విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2.

—o—

ఏది కవిత్వం అన్నది అనాదిగా వస్తున్న ప్రశ్న. కవితకు కవనగా పుట్టిందిది. కవిత ఉన్నంతకాలం ఉంటుందిది. ఈ ప్రశ్నకు అనేకులు అనేకవిధాల సమాధానాలిచ్చారు. కొన్ని సమాధానాలు కొందరికే నచ్చుతున్నాయి. అందరికీ నచ్చిన అంతా మెచ్చిన జవాబు ఏదీలేదు.

పుట్టిన కవిత్వానికి ఇదీ ఈ లక్షణం అని కొందరు చెబుతారు. ఈ లక్షణానికి అనుగుణంగా కవిత్వం పుట్టాలి అని మరి కొందరంటారు.

కవికి లక్షణంతో నిమిత్తం లేదు. కవితచెప్పడమే అతని పని. దానికి లక్షణాన్ని ఎవరికి తోచినట్లువారు ఏర్పరచుకొనవచ్చును అనే కవులూ ఉన్నారు.

పూర్వ కవితతోపాటు ఆకవితను విడదీసి వింగడించి సంగడాలను ఏర్పరచిన లక్షణాన్నికూడా తెలుసుకొన్న మీదటనే కవితా వ్యవసాయానికి దిగాలి అనే కవులూ ఉన్నారు.

ఈ లక్ష్యలక్షణ సంగ్రామంలో కాకుమంచి వెంకటేశ్వరరావుగారు సవ్యసాచిలాగ ప్రవేశించారు. 20 పుటల లక్షణాన్నీ 48 పుటల లక్ష్యాన్నీ కలిపి ఈ కవితా సంపుటిగా వెలువరించారు.

ఇందులో కవి స్వయంగా టిప్పణం ఒప్పణం చెపితేకాని తెలియని కావ్య ఖండాలూ ఉన్నాయి. "అశాంతి ముద్దుబిడ్డ క్రాంతి – ఆక్రాంతి – చివరన్వే శాంతి" అని క్రాంతి చక్రక్రమాన్ని సూక్ష్మంగా సూత్రీకరించిన సూక్తులూ ఉన్నాయి.

ఏమైనా కవితా రసశాలలోని శోధన గోష్ఠిలో కుతకుతలాడుతున్న కావ్యాలివి. ఈ సాధన, ఈ శోధన ఏవిధంగా ఫలిస్తుందో సాహిత్య వేత్తలంతా చూడవలసిన కావ్యం ఇది.

— కృష్ణమూర్తి.

# ఆంధ్రలిపి

(తెలుగు స్క్రిప్ట్)

శ్రీ కారుమంచి వెంకటేశ్వర రావుగారు ఇంగ్లీషులో వ్రాసిన పరిశోధక వ్యాసం ఇది. తెలుగు లిపికి టైపులో, అచ్చులో ఈనాడున్న ఇబ్బందులను తగ్గించి సౌలభ్యం సమకూర్చడానికి రచయిత ఒక పథకం సూచించారు. 91 ధ్వనులను 17 అక్షరాల ద్వారా వ్యక్త పరచడం సాధ్యమని రచయిత నిరూపించుతున్నారు. శతాబ్దాలుగా తెలుగులిపి పొందిన పరివర్తనను పేర్కొన్నారు. లిపి సంస్కరణ క్షేత్రంలో కృషిచేస్తున్న పరిశోధకులేగాక భాషాభిమానులంతా శ్రద్ధగా పరిశీలించవలసిన పుస్తకం. ప్రతులకు : నీ - నా ప్రచురణలు 5వ లైను, బ్రాడీపేట-గుంటూరు-2.

—తుమ్మల.

# తోడికోడళ్ళు

**'వెండితెర' నవల**

వెల రు **0-6-0**

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**

విజయవాడ-2.

అన్నపూర్ణా పిక్చర్సువారు శరత్ బాబు నవల "నిష్కృతి"ని అనుసరించి "తోడికోడళ్ళు" చిత్రాన్ని రూపొందించారు. ఇపుడీ చిత్రం ఆంధ్రదేశమంతటా విజయవంతంగా ప్రదర్శింపబడుతూంది.

సినిమాకు అనుగుణ్యంగా శరత్ నవలను, శ్రీ ఆత్రేయ, ఆదుర్తి సుబ్బారావు, డి. మధుసూదనరావుగారలు చలనచిత్ర కథనురచించారు. దీనికి ఆత్రేయ సంభాషణలు సమకూర్చారు. శ్రీయుతులు కొసరాజు, తాపీ, శ్రీ శ్రీ, ఆత్రేయగారలు పాటలు వ్రాశారు.

'తోడికోడళ్ళు' సినిమా కథను శ్రీ రామ్‌చంద్ గారు రసవత్తరంగా సంక్షిప్తీకరించారు. దీనినే చిత్ర నిర్మాతలు పుస్తకరూపంగా ప్రకటించారు.

'తోడికోడళ్ళు' నటీనటవర్గంకల ప్రధానముఖచిత్రంతోను, ఇతర చిత్రాలతో ఈ 'వెండితెరనవల' సినిమాప్రేక్షకులను, పాఠకులను ఆకర్షించుతోంది.

ఒక మంచినవలనూ, చలనచిత్రాన్నీ ఒకేసారి చదివినట్లూ, చూచినట్లూ అనుభూతిని కల్గించే ఈ ప్రచురణాపద్ధతి నిర్మాతల వ్యాపార మార్గంలో కొత్తది.

—o—

## ఆహార్యం (మేకప్)

రచన : శ్రీ కుమార్

**వెల: ఆరణాలు**

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2.

ఒక నాటక ప్రదర్శనం జయప్రదం కావాలంటే ఇతరవిషయాలతో పాటు ఆహార్యం కూడా ఒక ముఖ్యభాగం. ఆంధ్ర సినీనటన్స్ ఫెడరేషన్‌వారు విజయవాడ నాటక కళాపాఠశాలలో, శ్రీ కుమార్ బోధించిన పాఠ్యభాగాన్ని చిన్న పుస్తకంగా ప్రచురించారు. నటీనటులు, నాటక సమాజాలు తప్పనిసరిగా పఠించవలసిన గ్రంథం ఇది.

—o—

## స్వీకారం

**అంతర్గోళాలు :**

శ్రీ దుర్గానంద్

వెల రు. 1 – 8 – 0.

శిష్యక్ పబ్లిషర్స్, తెనాలి.

## చరిత్ర - సంస్కృతి - కళ

(చారిత్రిక సాంస్కృతిక వ్యాసావళి)

వెల రు. 2 – 0 – 0

సంకలన : శ్రీ పి. సదాశివరావు.

ప్రతులకు :
కాకతీయ ప్రచురణలు, వరంగల్

* * *

## జ్వాల

(చిన్న కథల ఎంథాలజీ)

వెల రు. 1 – 8 – 0

సంపాదకులు :-
శ్రీయుతులు కొమర్రాజు వేణుగోపాలరావు, మంచెకంటి గున్నారావు, రావి మృత్యుంజయరావు.
ఆంధ్ర సమాజం – నైన్‌పూర్.
యస్. ఇ. రైల్వే.

* * *

## తెనుగు మీరా

రచయిత: శ్రీ రామచంద్రకాండిన్య

వెల రు. 1 – 4 – 0

ఆంధ్రహిందీ పరిషత్,
హిందీప్రచారసభ, హైదరాబాద్.

---

## వార్తా పత్రికల రిజిస్ట్రేషన్

## రూల్ 8, ఫారమ్ IV ప్రకారం

## అభ్యుదయ ప్రచురణ వివరాలు

1. ఈ పత్రిక విజయవాడ నుండి ప్రచురింపబడుచున్నది.
2. త్రైమాసపత్రిక
3. ముద్రాపకుని పేరు : తుమ్మల వెంకటరామయ్య,
   అడ్రసు : దుర్గాగ్రహారం - విజయవాడ.
4. ప్రచురణకర్త పేరు : ,, ,,
5. సంపాదకుని పేరు : ,, ,,
6. భాగస్వాములు ఎవరూ లేరు.

పైన పేర్కొన్న వివరాలన్నీ యదార్థాలు.

విజయవాడ
1—4—57

తుమ్మల వెంకటరామయ్య,
ప్రచురణకర్త.

69

తప్పక చూడండి

అన్నపూర్ణా వారి...

# తోడికోడళ్ళు

...డైరెక్షన్...

ఆదుర్తి సుబ్బారావు

ANNAPURNA PICTURES (PRIVATE) LTD

CH.E. PRASAD RAO

సావిత్రి, కన్నాంబ, సూర్యకాంతం, రాజసులోచన, నాగేశ్వరరావు,
రంగారావు, రేలంగి, జగ్గయ్య. రూడ్ [కుక్క]

త్రివర్ణ ముఖచిత్రంతో కూడిన తోడికోడళ్ళు వెండితెర నవల వెల **0-6-0.**

ప్రతులకు విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2. నవయుగ

"అనేక రకాల పుష్పాల వికసించ నీయండి! విభిన్న ఆలోచనా ధోరణులను పోటీ పడనీయండి!!"

ఈ నినాదం అంతర్యం ఏమిటి? చైనా సాహిత్య, కళా రంగాలలో ఈ నినాదం ఎలా ఆచరింప బడుతోంది? కళా సాహితీ విజ్ఞానశాస్త్ర రంగాలలో నేటి చైనా విధానం ఏమిటి? మొదలైన ప్రశ్నలకు వివరణ ఈ గ్రంథంలో చూడండి!

# "మనోవికాసానికి మేటిబాట"

**82 పేజీలు :: వెల ముప్పావలా**

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం,**
**విజయవాడ-2.**

---

*A Fine Collection of*

**Mahakavi Sri Sri's POEMS.**

# Three Cheers For Man.

Rendered for the first time into English.

**Rs. 2/-**

Postage Extra.

*Copies available at:*

**Visalandhra Publishing House, VIJAYAWADA-2.**

అఖిలాంధ్ర ప్రజానీకానికి మా హృదయపూర్వక
ఉగాది అభివందనములు

# నేషనల్ ఆర్టు పిక్చర్స్

## విజయవాడ - మద్రాసు

### త్వరలో రానున్న మా చిత్రాలు

★

రాజశ్రీ వారి
**దాంపత్యం**
రేలంగి, వరలక్ష్మి, సుస్మశ్రీ

★

జలరుహా వారి
**రాజనందిని**
రామారావు, అంజలి, రేలంగి

★

ఎస్. ఎ. టి. ప్రయివేట్ లిమిటెడ్ వారి
**పాండురంగమహాత్యం**

✤

**అల్లూరి సీతారామరాజు**

★

మినర్వా వారి
**సారంగదర**
రామారావు, భానుమతి, రేలంగి,
రంగారావు

★

పి. వి. వి. యస్. యమ్. వారి
**భట్టివిక్రమార్క**

★

భారత్ పిక్చర్స్ లిమిటెడ్ వారి
**బభ్రువాహన**
రామారావు, అంజలి

★

మహీ ప్రొడక్షన్స్ వారి
**ప్రొడక్షన్ నెం 11**

వివరాలకు

**శ్రీ నేషనల్ ఆర్టు పిక్చర్స్ - గాంధీనగర్**
**విజయ**

# ఉగాది అభివందనములు

అంధ్రప్రదేశమంతటా దిగ్విజయముగా **3** వ వారం

జరుపుకొనుచున్న

గౌతమ పిక్చర్సు సమర్పించు

జూబిలీ వారి:

# ★ వేగుచుక్క ★



**★ వైజయంతిమాల, ★ నాగయ్య, ★ శ్రీరాం**

**★ రాజసులోచన, ★ తంగవేలు.**

గెస్టు ఆర్టిస్టులు

యన్ ... యస్.వి. రంగారావు, ఆర్. నాగే

...శన్. జెమిని గణేశన్.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M102 |
| పుస్తకం పేరు | అభ్యుదయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | Ci, Bci |
| | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| Scan | Ramya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |